శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.




ఇది

## శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడినది.





రెండవ కూర్పు.



కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రచురింపఁబడియె.



తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.

ఈకల్పితప్రబంధము పుచ్చా సీతారామయ్యగారి కంకితమీయఁ బడినది. ఇది యధికప్రయత్నముచే నను బలవంతపెట్టి యతఁడే రచియింపఁజేసినాఁడు. తుదకు జరుగకపోయినను మాకాయన చేయఁదలంచుకొన్న బహుమానము వేయిన్నినూటపదార్లు. ప్రకృతము కృతినేత మృతిచెందినను దీనిరచించి వినిపించినపిదప నాలుగుసంవత్సరములవఱకును చక్కఁగాజీవించియుండి మొదటఁ బ్రతిశ్రుతమైన ర్పినధనము నీఁజాలక యేదోమిషపెట్టి నానాఁటికి మాకు విసుపుపుట్టించి "ఇఁకనితఁడు సమ్మానించినను స్వీకరింపఁగూడ" దనునభిప్రాయమును బూర్తిగాఁగలిగించి యట్టి యుత్తరముగూడ మావలన నందుకొనెను. ప్రప్రథమము చిత్తుకాగితములమీఁదనే పుస్తకమును బూర్తిగావిని పరమానందమునంది వెంటనే యచ్చొత్తింప నెంతో యత్నమొనర్చి "సమ్మానానంతరమునఁ గాని ముద్రణమునకు వలనుగా" దని మేముద్దుపెట్టుటచే నించుకయనుగ్రహించి పైమొత్తమునకు నోటొకటి వ్రాసియుంచెను. వెంటనే దానిపై వసూలుపెట్టి తిరుగఁగొట్టితిమి. పదపడి కొన్నాళ్ళు బందరుపురమ్మునసే యుండెనుగాని ధనలోభముచే సమ్మానముమాత్రము జరిగింపఁజాలఁడయ్యె. అనంతరము తన యగ్రహారగ్రామమగు సిరిపురమునకు వాసముమార్చికొని యచటనుండి యుత్తరముల మూలమున సమ్మానించు నభిప్రాయమును దెలిపుచ్చుఁజొచ్చెనుగాని దైవ మనుకూలింపమిచేఁ గృతార్థుఁడుమాత్రము కానేరఁడయ్యె, తక్కినవిషయములెట్లున్నను నితఁడు ధనవ్యయమునకు మాత్రమించుకయు వెనుదీయువాఁడుకాఁడు. దాతృత్వముతోపాటుగా నవ్యవస్థిత చిత్తత్వమీతనికి సహజగుణము. "అవ్యవస్థిత చిత్తస్యప్రసా

దోపి భయంకరః" అనికదా? పెద్దలు చెప్పుదురు. కావున నిట్టివానికంకితముగాఁ గృతిచెప్పుట మాలోపమే యని మేము వ్రాయకున్నను లోకము నిశ్చయించుకొనక యెట్లు మానును? ఇతఁడంతలో దైవవశమున మృతిచెందెను గాని జీవించియున్నను సన్మానము చేయఁజాలఁడనియే మా నమ్మకము. సన్మానము కేమి? అతఁడెట్టివాఁడైనను "యశముకొఱకుఁగదా? అతిప్రయత్నమునఁ గృతిచెప్పించుకొనుట" యనియూహించి "మరణాంతాని వైరాణి" యనుమాట స్మరించి యీమా కన్యక నతని పేరుమీఁదనే ప్రకటించితిమి. వితంతూద్వాహమంతగాఁ దప్పులేనియీ కాలమున నీకన్యకకు బాల్యవైధవ్యమనుభవింపవలసినంత నిర్బంధనము లేశమును లేదు గాని యేమైనను నన్యథాకరించుటకు మనసొప్పినది కాదు. దీనిని సహగమనము చేయించవలెనను నూహ గూడ నుదయించినది కాని, యదియిప్పటి శాసనమునకు విరుద్ధమని తిరిగి యణఁగిపోయినది. పదపడి యీవిశ్వస్తకు భరణప్రాప్తి కలుగునను కొంతవంతి కలిగినది. "కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభం" అనురీతి నున్న యీ భరణమునందును మా కృతికన్యకిష్టము లేదు.... గుణగ్రాహులు రసజ్ఞలోకమే నిర్ణయింపఁగలరుగదా? యని...... ..............యింతటితో నీయంశమును ముగించుచున్నాము.

తిరుపతి వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణపీఠిక.



చదువరులారా ?

ఈ కబ్బమునుగూర్చి వ్రాయఁదగు నంశములన్నియు మొదటి పీఠికయందే వ్రాయఁబడియుండుటచే నిపుడు నూతనముగా నిందు వ్రాయఁదగు నంశము లెవ్వియును లేవు. కాని ముద్రాయంత్రమునందలి యక్షరములు బొత్తిగా నలిగియుంటచేఁ బ్రతిపుటయందును నెన్నియో యచ్చుతప్పులు కలవు. అందు "ం, న, వ, మ, గ, వి, ఈయక్షరములు చాలభాగ మంటనేలేదు. మఱికొన్ని యక్షరములుకూడ నంటనివికలవుగాని వీనివలె బొత్తిగానంటకపోలేదు. ఇఁక ప్రూఫులుచూచువారి ప్రమాదమువలనఁ గలిగిన లోపములు మాత్రమిట క్రిందఁ జూపి విరమించుచున్నాఁడను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 2 | కఁట | కట |
| 6 | 4 | నేమమూ | నేమమో |
| 6 | 20 | భంబు | భంపు |
| 8 | 12 | స్టైక | స్లైక |
| 8 | 23 | గుఱు | గుర్తు |
| 8 | 24 | జాతి | జాతిక |
| 14 | 18 | లోగ | లోఁగ |
| 15 | 23 | ము చ్చ | ము నెచ్చ |
| 19 | 3 | జని | జాతి |
| 19 | 12 | బెంకి | బెంకె |
| 20 | 14 | ల్లాలి | ల్లాలు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 24 | నొక్క | కొక్క |
| 25 | 6 | లును | లను |
| 26 | 27 | వ్యా | వ్యాని |
| 27 | 11 | ంగుటిం | గుటి |
| 27 | 15 | గోర | గోరి |
| 30 | 13 | నిచ్చలు | నిచ్చల |
| 33 | 24 | గ్గునడ | గ్గుండ |
| 34 | 8 | బిడ | బిడి |
| 38 | 9 | తంగా | తింగా |
| 38 | 9 | మురన్ | మున్ |
| 38 | 15 | యమున్ | యమునుం |
| 39 | 10 | దజలె | దంజల్లె |
| 42 | 1 | డునన్ | డుమాన్యందునన్ |
| 44 | 7 | చెప్పిన | చెప్పినన |
| 46 | 9 | చెనటి | చెనంటి |
| 46 | 27 | నీటి | నీటు |
| 47 | 4 | భుజంగు | భుజగు |
| 50 | 8 | దుందు | తుందు |
| 50 | 10 | నది | నయది |
| 51 | 3 | లేద | లేవ |
| 51 | 20 | నొప్పు | నొప్ప |
| 52 | 4 | బోవు | వోవు |
| 54 | 17 | టొప్ప | టొప్పు |
| 58 | 1 | సల్సె | సల్పె |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 58 | 4 | సూపి | జూపి |
| 59 | 10 | వటందు | వటంచు |
| 60 | 2 | దున | దన ? |
| 61 | 5 | జల | బల |
| 62 | 3 | యిచు | యించు |
| 66 | 10 | స్యాందా | స్యానందా |
| 68 | 23 | వేళ్ళనో | వేనోళ్ళ |
| 70 | 10 | దేని | డేని |
| 70 | 11 | గుర్తై | గుర్తై |
| 76 | 7 | మీాతని | మాతని |
| 77 | 22 | సందు | నందు |
| 78 | 4 | త్రోష | రోష |
| 83 | 23 | ట్టుల | నట్టుల |
| 88 | 24 | చవు | చనవు |

ఈచూపినవి ముఖ్యమైన ప్రమాదములు అంటలేదని మొదట సూచించిన పూర్ణానుస్వారములోనగునవి దిద్దనే లేదు. అవి తఱచుగా బాిసస్థానమందుఁగూడ నున్నవి. కావున దిద్దకున్నను సులభముగాఁ బ్రాసస్థానమందుఁగూడ నున్నది. కావున దిద్దకున్నను సులభముగాఁ డెలిసికోవచ్చును. అట్టివి కొన్ని యితరస్థలములయందును గలవు. ప్రాజ్ఞులే ప్రమాణమని యుపేక్షింపఁబడియె.

చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

శ్రీమత్పరదేవతాయై నమః.

# పాణిగృహీత.

(తిరుపతివేంకటీయము.)

## ప్రథమాశ్వాసము.



శ్రీదుం డాప్తుఁడు గౌరి భార్య, యచలశ్రేష్ఠుమ్ము మామమ్ము, వి
ఘ్నాదుల్ మాపెడివాఁడు పుత్రుఁడు, శుభం బర్పించుశబ్దమ్ము సే
రై దైవారెడువేల్పు నిత్యకరుణావ్యాప్తుండు పుచ్చాస్యయుండై
దాఁ దాత్పర్య మెలర్పఁ బ్రోచు నలసీతారామనామాంకితున్. 1

చ. గురు వగుబ్రహ్మపండితునకు న్నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురు లగుసంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటిమేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు నామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు నంజలుల్. 2

తే. గీ. లజ్జ గల్గిన పూర్వకాలమ్మునందుఁ, గోటి కొక్కఁడు గన్పెఁబో! కుకవి, నేఁటి
కాలమం దేమికర్మమో కవులనూటఁ, దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుండ్రి. 3

ఉ. కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మాఱె నర్థపుం
జాతుని హెచ్చె నల్పమగుసాహితితోఁ బెదపెద్దపత్రముల్
చూతురు తప్పు దిద్దుదురు, శూరత చచ్చెఁ గవీంద్రులందు సీ !
మూతులు గట్టిపెట్టికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. 4

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపాటొకయింత లేక "మీ
దగుకయితమ్ము సూఁచితిమి చూం దది యిం దిది" యంచుఁ బత్రముల్
దగులుచు రందుకోసమె మొదల్ దమ రంపుదు రిక్కవుల్ వృథా
యగుఁగద! దీనిసమ్మతు, లహో! తగువారి కివేల? కాల్పనే. 5

తే. గీ. అన్నిపాత్రములకు మొదలెన్ని ఫ్రటలొ, నింక నభినందనములతో దండుగ కటు
యొక్కఁ డేనియు నిజముగ నూహ వ్రాయఁ, డట్లు వ్రాసిన నద్దాని నడఁతు రొకట. 6

తే. గీ. భారతము పై నెవరి యభిప్రాయ ముండె, మనుచరిత మొదలేరి సమ్మతులు నిలిచెఁ
దీపి లేని ఫలమ్ము పైఁ దేనె చిలుక, నేమి యగుఁ దీపి గలదాని కేమి వలయు, 7

తే. గీ. చేతఁ గాని శతావధాని చేతిబడ, సర్టిఫికేట్లుకట్టులే, సహజశక్తి
గలుగువారల, కవి యేల? కాల్పనే స్వతఃప్రకాశుఁడు గోరునే? తనకు దివ్వె 8

క. "సంగీతసాహిత్యములు వా, గంగనకుఁ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి, శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. 9

ఉ. ఇంతకు నింత మాకెనిఁక నిన్ని యనంబులుగూడఁ జుంబనా
శాస్త్రితము లౌట మోటనుచుఁ గాళ్ళగ మార్తురొ వేస్త్రిళ్ళటందురో
త్రెంత్రిణికాఫలమ్ము లనఁ డీఱదె? పూర్వకవీంద్రు లక్కటా!
యింత వివేకముం దెలియరే? యది దిద్దెడిపాటివారమే? 10

క. స్తనశల్యపరీక్షకుఁ బో, యిన ఫలముం గలదె! వాని నిటు పోల్చినయు
య్యాసఘునిభావము నెఱిఁగిన, జనుఁ డేగతి దిద్దు? నది రసం బెటు లిచ్చున్. 11

తే. గీ. ఇంతమార్దవ మెఱిఁగియు నిహిహి! వీరు, బాలకుల కంచుఁ జేసినపాఠపుస్త
కముల నక్షరాంగములగ థ నిముడఁ జేసిరటనుపాధ్యాయు లెటు చెప్పనగునో? యకట!

ఉ. కంకురుకుంక లైనపలు గాకికలార్థుల కెట్లు పాఠ మీ
యంకుపురాణముల్ నయభరప్రద మంచు వచింప నొప్పు? సా
శంక రయినర్పరే? నగరె? "సర్వము నీతికె" యందురేని మీ
సాంకునిఁ జెల్వు నారతిరహస్యము పాఠము పెట్టరాదొకో! 13

తే. గీ. తగినసామగ్రి దొరకిన ధార లేదు, ధార గల్గిన సామగ్రి దనరఁబోదు
రెండు గల్గినవారితో నొండు గల్గు, వారు డీకొన నది సగుఁబాటు గాదె? 14

ఉ. కొంచెము గొప్ప సంతసము గొల్పినఁ జూడుఁడు చించివేయుఁడే
మంచియు లేనిచో, నివియె మా నమనమ్ము, లనుగ్రహించి మ
న్నించుఁడు శాశ్వతబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "పెన్నెపె" యందురు మే మదర్ప్యకన్. 15

చ. పరిణతశక్తు లైన యలభారతపుంగవు లట్టు లుండ ము
ష్కరుఁ డనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణ వా
గ్వరచనఁ గూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నచిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య! వాగ్విదుల్. 16

క. తొలిబాసయందుఁ బలె నీ, తెలుఁగుంబాస వెలయించుదీపము లేమిన్
విలువగలకవులలక్ష్య, మ్ములె తా మీభారమెల్ల మోయఁగవలయున్. 17

క. ఈభాగము మేమల దే, వీభాగవతమ్మునంద వివరించితి మీ
క్షోభ యిట్టు మరల నేల! ప, రాభవ మందకుఁడు పైకి రాకుఁడు కుకవుల్. 18

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱుటది సత్కవిసమ్మత మౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁ గలవాటును నాచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పరందురో. 19

మ. అగుఁ గావ్య మ్మని, యైనను న్బ్రహసనప్రాయమ్ము, ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాస, రో
మగునన్ నాయికచేఁత, దుర్విటులనిర్మర్యాదవాక్యమ్ము, లొ
ప్పుగ దానిన్ వెలయించుఁ బండితులు తప్పుల్ దీరురేమో కదా! 20

తే. గీ. కవిత యన్నపు డెవరివాగ్రచన యెట్లొ, దాని కనుకృతి సేయుచోటే తగినఫణితి
అంతియే కాని యెల్లెడ ననుగుణపు, శైలి గల్పించు టది యెట్టిచంద మకట! 21

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహీసురులను, జెప్పఁగతి దుర్విటులు వాడుతప్పుమాఁట
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ, బచ్చి యుండక మాన దప్పట్లు నిజము. 22

క. అనరాదు గాని యప్పక, విని "గనులున్ జనులు మొదలు వేయఁదగని" వం
చనియె నివి భారతాదులఁ, గనుఁగొనెనో లేదొ, శతము గన్పడు నకటా! 23

ఉ. తా నొనరించుకట్టునకుఁ దప్పినపాత్రము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో!
మానెను బోతరాజకవిమండనువాగమృతంబు గ్రోలలే,
కైనను దోసముల్ గలవె? యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్. 24

ఉ. తాకుతు రేఫయుక్ జెలిమి రాదని పెద్దవివాద పెంచెఁ దా
నేకళనుండి వ్రాసెనో కవీంద్రుఁడు నన్నయ, కల్పయూనివా
రే? కవు లొక్కరే, మధుర రేఫలె యువ్వి? ననల్, కసల్, లడల్,
గాక యభేద మీయొకటి గా? తగదుంచుట, మేలు మేల్! బళీ! 25

శా. శ్రీనాథాదుల తేనిలోపములు వర్ణించెన్, కలాభేదసం
ధానంబున్ దొఁదెంచి దిద్ది, యది గన్నన్ సవ్వరే! శాబ్దికుల్,
తా నేయేయువి లేవనెన్ దనకు నంతర్వాణు లౌసత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు వీ లియ్యెడన్. 26

క. ఎఱిఁగి ప్రయోగించినదో, యెఱుఁగనిదో తెలియవలయు నిచ్చో నలవ్యా
కరణపుభాష్యములో వ్రా, సిరి చీవా ట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుచున్. 27

క. ఎన్నెన్నిపొత్తములు కవు, లెన్నెన్నివిధాలఁ జెప్పి రెన్నెన్నివిశే
షోన్నతు లరయ్యదఁ గన్నడు, నన్నియుఁ దెలియంగ శక్యమా? యొక్కనికిన్. 28

తే. గీ. వాడిదౌర్బల్యమే కాని లేదు వాద, దుర్బలత్వము, లక్ష్యముల్ దొరక వనుట
బొత్తిగాఁ దప్పు, తెలుఁగున బొంకి రిట్లు, సంస్కృతమ్మున నింతగా సాగ దాట 29

ఉ. ఇంతయుఁ బోతరాజకవి నీకఁడు దాఁ బహివెట్టె దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, దు
ష్ప్రాంతులు తక్కలాక్షణిక లందఱు నేమి, యెదిర్చి యక్కవిన్
గాంతికిఁ దెచ్చి గప్పకవి కా దనుమాత్రములోనఁ బోయెనే. 30

మ. యతియో ప్రాసయొ తప్పు చేరికిని రాదా? దానఁ బాండిత్యవి
స్ఫురితిన్ లోపమె? భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యర్థయ"
మ్మతిపూర్వోక్తి దలంపుఁ డొందఱును దా మీపూర్వపుంబొత్తముల్
వతి మమ్ముఖ్యులు దిద్దకే కలిగెఁ బ్రామాణ్యమ్ము, యోజింపుఁడీ. 31

ఉ. వారికి నిచ్చరచ్చగతి వారును వారును దిద్దరేని యా
భారతమాదిగాఁ దెలుఁగుబాసను సంస్కృతమందు నొక్కచో
దారిని బోవు పాఠములు, దానికిఁ గారణ మేమి? యిప్పుడు
ద్వారకశాలయమ్ములను దప్పులుతప్పులు కొన్ని చొప్పడున్. 32

వ. అని శిష్టాచారచ్ఛలమ్మున నూత్నప్రాయమ్మున నించుక చర్చించి యొక్కెడఁ గార్య వశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నాబాల్యమిత్త్రుండును నవా దిపవిత్రతర పుచ్చావంశసంభూతుండును గానరసకోవిదుండును గవితామాధురీసురి ణుండును నగు సీతారామనామకవిప్రధనదతనూజుం డొక్కవాఁడు.

ఉ. తా నొకపార్కనిన్ శ్రుతిమనోహరముగాఁ దగుదాని నూని డెం
దానముఁ బ్రీతి గొల్పఁగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మఱిన్
దానికి వేఱుగానిగతిఁ దంబుర మీటుచుఁ గొంద ఱెల్ల "రా
నా" ననురీతిఁ బాడ నది పాయుగ వించుఁ దదేకచిత్తుఁడై. 84

వ. కొండొకసేపు విస్మృతసకలప్రపంచుండై కాలక్షేప మ్మొనరించి చిఱునవ్వు నవ్వు చు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియెను. 85

చ. "తిరుపతివేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ నూని పా
మరులకు మెచ్చుగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటి గాని యొకపాటిప్రబంధము నైనఁ గైకొనన్
జిరమున నుండి యత్నమును జేసియుఁ గానయితిన్ గృతార్థుఁడన్. 86

తే. గీ. ఆత్మకూరునృపాలునియట్లు మిమ్ము, నేనుఁగంబారి నెక్కింప నేమొ కాని
తక్కసమ్మాన మొనరింపఁ దగినపాత్రి, సిరి గలదు సుంత నాకు లచ్చిపతికరుణ. 87

చ. అన విని "నీ కొసంగు టొకయబ్బురమే? మఱి విప్రులందు మేల్
ధనమున దాతృతాగరిమఁ దక్కప్రశంసల నూటనాఁటఁ ద
క్కిన గలరే? నినున్ దొరయఁ గీర్తిపరుల్, కయికొ మ్మదశ్యమున్
మనమున శిష్టమైనకృతి మాన్యతరున్ దగుదాని" నావుడున్. 88

ఉ. ఇప్పటికెంత లేదనిన నిర్వదికిన్ బయినుండు మీకృతుల్
తప్పక సేయు నాశతవధానపుఁబద్దెములున్ నృపాళిపై
గుప్పినపద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది, దాని నేను మనుగోంటి, నీ యుకపోతి రెందుకో? 89

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తఱచుగాఁ గబ్బమ్ములం దొల్లెడన్.

శ్రితులకున్ దనర్చుచునటంచేసి యిఁకనేఁ జోద్యమ్ముగా నూత్నపుం
గృతి నిర్మింపఁగఁగోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్. 40

చ. మనుజున కెద్దిసౌఖ్యమొకతె మానినియందుట యొప్పునో? కుల
మ్మున కనుకూలమైన విరిబోణియె యంచొకనేమమా? యిటుల్
మనమున నెంచిమాఁడె నెట మంచియిహమ్ముఁ బరమ్ము వాయదో?
వినవలె దీనికెంతయును వీలగు గాథ రచింపుఁ డొప్పగన్. 41

వ. అని సకర్పూరతాంబూలమ్ము గట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టిగావించుటకు నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱిఁగియు మఱింత విశదీకరింపఁదలంచి యతనిఁ గూర్చి. 42

ఉ. పాణిగృహీతి యందురు వివాహితయైనసతిన్, దనంతఁ దాఁ
బాణి గ్రహించి యుంచుకొను బానిసతొత్తును శాబ్దికాగ్రణుల్
పాణిగృహీత యందు రొక వర్ణమునందునె కాక యెన్నిరా
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునన్ బ్రభేదముల్. 43

ఉ. చన్నయు నేనుఁగున్ సరిగఁ జూఁగునె? యంచయుఁ గొంగ యొందు నే
నెన్నఁడుగాని సాటిగను నే? మఱియెక్కడి కెక్కడ? దక్కడా!
వన్నెయువాసియున్ సుపథవర్తనమున్ గలువారు భార్యకున్
మున్నరికంపుఁదొత్తునకు మాధురెఱుంగఁగఁ జేతగనో? విటుల్. 44

వ. అన నతం డిట్లనె.

చ. విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంబుశైలి నొ
క్కటి రచియింపుఁడీ? కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కొలుపుకోరిక లిప్పటి కీరికల్గనన్. 45

వ. అనుటయు

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకము లున్నవి దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతింపునుకృతాతిశయమ్మునఁ గాలువెట్టకే
డె దము తక్కియుండవలె డెప్పంపమై యటు గాక తక్కనన్
విందుమె? యొందు నేనియును వెన్కకుఁ దీక్షుగఁ జేయుకబ్బముల్. 46

చ. సుకృతపుబుద్ధి మాకుఁ బెను సుందరియే గురువై చుఁ దోఁచు దు
ష్కృతులె యాగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై తగుజన్మమున్మనం,
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్. ౪౭

వ. అయినను బాటించువార లసదని నీతన్ బోధింపమానఁదగదు గాన నీమనోరథంబుచొప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాచారమ్ము కతనఁ గృతినేతయగు నతని వంశమెట్టిదో కొంత వర్ణించెదము. ౪౮

బ్రహ్మముఖోత్పన్నంబై యొక్కుచు ప్రశస్తికెక్కు నాదిమవర్ణంబునం దొక యవాంతర శాఖ యగు వెలనాటి వంగడమ్మునందు గౌతమసగోత్రమ్మున "పుచ్చా"నామక వంశమ్మున ననేకులు మహామహు లుద్భవించి యశమును గాంచి మించిరి. అందుఁ గాలక్రమమ్మున విశ్వనాథభొట్లను ధన్యుండుదయించె, నియ్యనఘునికి విశ్వేశ్వరసోమయాజులు జనించి యఖండపండితుండై ప్రశస్తినందుటయే కాక దంతులూరను నొక యగ్రహారంబు సంపాదించె. నీమహనీయుని కొమరుండు లక్ష్మీనారాయణశాస్త్రి, ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వేశ్వరసోమయాజియు, సీతారామసోమయాజియు, లక్ష్మీపతిసోమయాజియు, కామేశ్వరసోమయాజియు ననునేగురు సాగ్నికసామ లుదయించిరి. అందుఁ గనిష్ఠునకు సీతారామశాస్త్రి, రామయ్య, రాజయ్య అను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకు పూర్ణయ్య, లక్ష్మీనారాయణ, కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథము ననునేగురు సుతులుదయించిరి. ఈయైదుగురును సుప్రసిద్ధులే యైనను నిందు ద్వితీయుండగు లక్ష్మీనారాయణాహ్వయుండు స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్నదాననిరతుండును మహావదాన్యుండునునై మిగుల యశమునందె, ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచిన పరోపకారి. ఈతని యన్నదానమహత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చియేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతండనపత్యుం డగుటతనఁ దన పిన్నతమ్ముండగు శ్రీరాముని కుమారుని దత్తుఁగాఁ బిన్ననాఁడె గైకొనియె. అతని పేరు సీతారామయ్య, ఈయనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు, ఈవంశము వేదవేదాంగాది విద్యలకు నాకర మనియు తద్విహిత కర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి

మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటంజేసి యావిష
యమును మరల విస్తరించుట పునరుక్తియని యాజోలికిఁ బోక యీయన్వయమునం
దెల్ల నెక్కుడు త్యాగభోగరాయఁడని లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుం
డీకృతికి నధినేత కావున నారసికునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్పఁ
బూనిన పాణిగృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు. 29

ఉ. పత్తన మొక్కఁడొప్పు "హరిపావకముఖ్య దిగీశలోక సం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందఁ జేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె నిజ" మ్మని యెల్ల పాండితీ
వేత్తలు దన్నుతింప నరవిందసమాఖ్యఁ బరిమళించుచున్. 50

మ. నదికిం దాపఁట చుట్టుపట్టులను నానందమ్ము పుట్టించు చె
ల్వొనరన్ వర్తిలు తోఁటలొప్పునఁట వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవన మయ్యెడన్ గలదఁట న్యాయం బట్టి దొం డుండునే! 51

ఆ. వె. లచ్చి యెల్లవేళలను నందుఁ గాపుర, మ్ముండుకతన దాని కొదవుపట్టి
పేరు సార్థకంపుఁ బెంపునఁదగె నేతి, బీరకాయరీతి నీఁ సిలక. 52

తే. గీ. వెండికొండల మాదిరి వెల్లదీవు, లవిధమున మల్లెపూలరాశి వడువునను
సంతత సుధామహోల్లసత్సౌధ పటలి, కనులపండువు సేయునక్కటకసీమ.

మ. కనకమ్మన్నను లోష్టమున్న సరిగాఁ గన్గొంచు నవ్యాంగనన్
జననింగాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము పోనీక నె
మ్మనమెల్లప్డు విరాగమంది యిడి ధర్మప్రక్రియన్ బొల్చి తా
మనసూయా పరులౌట నత్రులుసుమీ! యాప్రోలి విప్రోత్తముల్. 54

చ. అరిమదభంజనమ్మునన యాగ్రహ, మాగ్రహ మబ్బినప్డునన్
శరణనువారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుత్తి, సం
సరణమసారమంచెఱుక, క్షత్రియజాతిఁ బెట్టెసొమ్ముల
ప్పురమున, నేల శూన్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్ 55

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి, నట్టి తమపూర్వపురుషుల యశము చూచి
కాని క్షత్రియకృత్యమ్ము కైకొనంగ, దగుదు రప్పురికోమటుల్ ధనదసములు. 56

ఉ. ఎండలవేళ దున్న రది యొద్దులగానికి హేతువంచు, బ్రి
హ్మాండము క్రిందుమీఁదయిన వాడినమాటకుఁ దిద్దులేదు మ
ట్కాండలు రామసచ్చరిత గాక యనేకపురాణజాలముల్
మెండుగఁ దామెఱింగిన సుమేధసు లప్పురి నున్నపాదజుల్. 57

తే. గీ. పూవులమ్మెటఁ గని పుష్పలావికలని, గుఱుతుపట్టుదురే కానిగోనబుత్తనపుఁ
బలుకులను మేనితళుకులఁ గులుకుఁజూపు, లౌర! వారాంగన లటన్న యాసఁగొలుపు

మ. ఎలనీటికిన్ బురణించు నీగ్గలిగి తామేకాలమందింక క
ప్పులతో నిండియు నూరకే యెవరినిన్ బోనీక పంకమ్ము లో
పలనున్ దాల్పక యోగిచిత్తములరేవన్ దోల్చు నవ్వీటి బా
వులు గన్గొన్న మహెట్టి పాంథులకుఁ బోవున్ మేనిఘూయాసముల్. 59

తే. గీ. శాంతియార్జించుపాంటె వేదాంతములను, జదువనేటికి? క్షమకునై జపతపమ్ము
లూననేటికి? నప్పురినున్న మత్తగజముల పవిత్రతనముగన్నఁ గలుగవొక్కొ. 60

క. తమసహాయుఁ డుచ్చపదవిన్, గొమరారుట తాముక్రిందఁ గ్రుమ్మరుటయును సైఁ
పమి నచటి సైంధవములు న, భముపయికిన్ దుముకు దవుడువారసిపట్లన్. 61

ఉ. తాళి యొకండు లేదనెడి తప్పిద మొక్కటితప్ప గేహినీ
లీలలఁ దమ్ముఁజేకొనిన లేఁతబోజుంగులఁ దన్పుచున్ గళా
శాలిను లౌటకున్ ఫల మసత్యము దూరముచేయు తద్ధన
స్త్రీలు నిజమ్ము లంజెలఁ బతివ్రత లన్న మటేమి దోసమా. 62

ఉ. అందొక భూసురుండు సకలాగమవేత్త యనాదిసుప్రసి
ద్ధిం దగువంశమున్ మఱియు దీప్తికిఁ దెచ్చెడి సద్గుణవ్రజం
బందె చెలంగువాఁడు నిరతాన్నవితీర్ణికి సాటిపట్టున
స్పందితచిత్తవర్తనుఁడు భాసిలు శంకరుఁ డన్న పేరునన్. 63

మ. పరకాంతాపరకీయవిత్తహరణప్రారంభముల్ సేయుమ
మ్కురులన్ వీనులఁబెట్టఁ డొక్కరుఁడుఁ బ్రాక్కర్మమ్మునన్ జేసి దే
గ్గతిఁగన్ విన్నను హా! శివా! యనుచు లోఁ గంపించు టేకాక య
ద్దురితంబున్ బెడఁబాపఁ జేసికొను నెందున్ లేని సత్కర్మముల్. 64

ఉ. వైదికుఁడయ్యు లౌకికప్రవర్తనమందును బ్రజ్ఞ గల్గి సం
పాదనచేసె లక్షలకుఁ బైఁ గడు హెచ్చు గుడిద్రవ్య, మగ్రిజ
శ్రీరత నిట్లు గాంచియును జిత్తజుబారికి లోఁగియుండె వే
శ్యావియు నేని దుర్వ్యసన మేర్పడియుండె వ్యయింపఁ డింతయున్. 65

సీ. కట్టించె మిగులఁ జక్కనిరీతి నన్నదానము సల్పనట్టి సత్రములగములు
చేయించె నెంతో చేసాచి యడిగిన బ్రహ్మచారులకు వివాహములను
శివకేశవులకు హెచ్చినభక్తి నూరూర నమరఁగాఁ జేసె దేవాలయములు
వేయించె ధర్మార్థమై యింపుసొంపారునట్టితోఁటలు నూటికన్న హెచ్చు;

తే. గీ. యజ్ఞములు సేయఁ జేసెఁ బైనందెఁ గృతుల, నగ్రహారమ్ము లొకకొన్ని యాదరించెఁ
దిక్కులేక లేమ సప్తసంతానములను, నొక్కసంతానమే లేకయుండెఁ గాని 66

ఉ. ఆతనిభార్య యందులకె యాత్మ సదా దిగులొందుచున్ బురా
రాతికి గౌరికిన్ సిరికి రాక్షసహారికి వాణికిన్ సదా
ధాతకుఁ దిక్కువేల్పుల కెదన్ ముదమిచ్చు వ్రతమ్ము లెన్నియో
చేతికొలంది దానములు సేయుచుఁ జేసెఁ బ్రియుండు మెచ్చఁగన్. 67

వ. ఇట్లు పతివ్రత యనేక కాలమ్ము నానావ్రతమ్ము లొనర్చియు వివిధనదీనదమ్ములఁ
గ్రుంకులిడియుఁ దుదకు విసువుపుట్టియు నతఁడు 68

క. "అన్నతనూజునకును దాఁ, గన్నతనూజునకు భేదగతి గల్గునె?" యం
చున్నతరూపవిశాలుఁ, డన్నయుఁ దనయన్నకొడుకు సాకఁగ నెంచెన్. 69

తే. గీ. ఎంచి తనభార్యఁ గ్గాని యిట్టులనియె, "గరికి! యెన్నాళ్ళులిటు కష్టపడికి నోర్చి
కల్పములనన్న వ్రతములు గడఁగి చేతు?, విది పురాకృతకర్మమ్ము నెట్టులడఁచు? 70

వ. సంతానమ్ము లేకయుండుట యిహలోకానందమ్మునకె కొఱఁతఁగలిగించుఁ గాని పర
మ్మునకించుకయు భంజకమ్ము గానేరదు. "అపుత్రస్య గతిర్నాస్తి" యని కేవలకర్మ
ఠులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞాను లొప్పరు. 71

తే. గీ. ముక్తినందెడి వానికి ముఖ్యమొక్క, జ్ఞానమగు గాని యితరమ్ము గాదు దాని
నెనయలేమందు నొకపాటిహీనమతుల, కియ్యదియ నొక్క తెరువని యెఱుఁగు మబల.

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి? శుకయోగి కెందఱు సుతులు వొడమి ?
రల యాంజనేయున కాత్మజు లెందఱు? గణపతి కే పాత్రి కాన్పుగలదు ?
వైవారలందఱు పడిరె? దుర్గతుల, సంతానమ్ముగల్గ నెందఱు మనుష్య
లిపుడు పిశాచాది హీనజన్మమ్ముల నెత్తుట లే దింతయేల? పుత్రుఁ 72

తే. గీ. డెఁతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క
యెడల నగునందువేని నీ విదియు వినుము. 73

వ. పుత్రునివలన ముక్తిగలుగునని చెప్పెడిపురాణమ్ములే వారు పదితెఱఁగులని యు
నందు దత్తుండును బరగతికి సాధన మ్మగుననియు ఘోషించుచున్నయవి
గావున. 74

క. నాయన్నకు సుతులెందఱో, శ్రీయుతు లున్నారు మొన్న చిన్నసుతుఁ డొకం
డాయురాభాగ్యసమన్వితుఁ, డై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. 75

వ. ఉదారుం డను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూఁడునెలలగుటయుఁ గర్మ
వశమ్మునఁ దలిదండ్రులు శిశువును గతించుటయును నీ వెఱుంగనిది కాదుగదా! అట్టి
శిశువుఁ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డవ్వానికి
మనసకలసంపత్తులుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్ప నేరదు ?
మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 76

చ. కనుఁగవతీరు నెమ్మొగముకాంతియుఁ జెక్కులసౌరు నాసయు
ప్పును నళికంబు చందమును ముద్దులుగుల్కెడి లేఁతనవ్వుపొ
ల్పును వెసఁ దైవ పేరముపోడిమి యుంగని మిసిమిన్ జెలంగు నే
మును గన వానిఁ బ్రాకృతజనుం డనబోల దొకించుకేనియున్. 77

ఆ. వె. "ఎచట రూపమబ్బు నచటను గొనములు,సంభవించు"నను మ శాస్త్రవిదులు
పల్కుచుందు రింకఁ బనిలేదు యోజింప, వాని స్వీకరింపవలయు ననుచు

చ॥ పతిఁగని యిట్లు పల్క నలపావని "యోయనఘాత్మ! మీరలా
నతి యిడి నప్పుడే యదియు నాకును సమ్మతమైన నిందులో

వెసకిన దోసముల్ గలవు వీఱేఁకులై యొకసారికి వానిచే
పతమును గుందుమన్న మనుజన్ముల నెందఱిఁ జూడ మిద్ధరన్. 79

చ. కలిగినవాఁడు యోగ్యుఁడగుఁ గాక యయోగ్యుఁడె యౌనుగాక తా
ములుగరు తల్లిదండ్రు, లతఁ డాడిన దాటఁగ సాగఁజేతు ర
న్యుల నిరుపన్న భేద మొకఁ డుండుటచే మఱి యెంతమందిరో
కలిగిన మీఁదనైనఁ దమ కానుపులన్ బలెఁ జూడ రివ్వరున్. 80

చ. అతులిత బుద్ధిశోభఁ దను సత్యము నాగము మీఱఁ జూచినన్
గ్రిమముగ నత్తవాఁడొకఁడు గన్పడఁ డేఁటిసేని యేరిలో
పముననో భేద మబ్బుట ధ్రువం, బటు గావున దత్తపుత్రిశో
కమునను నగ్గలం బగుటకన్నను వేఱొక జెట్టి యున్నదే. 81

ఉ. వాఁడొకవేళ నత్తినను వానితలోదరి యత్త దేగతిన్
గూడెడి సౌఖ్య? మెట్లు లొనగూడెడి? సంసరణమ్ము, లేనిచో
లేఁ దనువంతియొక్కటియె లేదితరం, బిటులైన సంసృతుల్
పాడరుఁ బెల్లుఁగ్రెసి వివాదలు, స్త్రీపదు లుబ్బి యార్యగన్. 82

తే. గీ. ఎందఱు జమీనుదారులు హీనులైరి, యెందఱగ్రహారస్థులు కుంటువొంది,
కెందఱు ధనాఢ్యు లియ్యెడ నింపుచెడిరి, గాన దత్తుఁగొనుట దుఃఖంపుతెరువు.

మ. కులవిధ్వంసకు లెందు, ముందల ముటాకోయల్, స్వకర్మస్థితుల్
దెలియన్ జాలని మాఱుబాసమొరకుల్, దీపించుచున్నారు పు
త్రులు కాలస్థితిఁబట్టి, యిట్టి వెడఁగుందోకమ్ములో నేమి? పి
రలు సేవల్ పొనరింతురో? మఱి గయాశ్రాద్ధమ్ములన్ జేతురో? 84

ఉ. ఈకలికాలమందు "సుతులే పరసాధన"మంచు నెంచువా
రే కడుమూర్ఖచిత్తు, లదిగో మొకొ యొక్కని నోటఁ జూచినన్
వాడు "మస్త్రీలు? తద్దినము వైదికకర్మము లెందు?" కంచు నే
స్తోఁడు నెవండొ యొక్కరుఁడు చూడఁబడున్ గువియున్ మహాత్ముఁడున్.

చ. పితరులసద్గతిన్ గుఱించి పెంచుకొనం దగునెవ్వరేని నేఁ
టి కులువలాలఘుల్ పలుపు రీవుల కేడుతరమ్ము లిట్టటుల్

గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కువంబు, సం
తతికి ఫలమ్ము నోపుకతె దాపరమయ్యె నిఁకేటి సద్గతుల్. 86

చ. అన నతఁ డిట్లు పల్కె "నెపుడైనను గొందఱు యోగ్యు లవ్వరీ
తిని మతిఁ గొంద ఱుందు రది ధీరహితం బిపుడంత నెక్కుడై
కననగు దుష్టపద్ధతులు, కాఁదగు కార్యము కాకతీఱ దె
వ్వని వశమౌ నయో గానఁగతి వచ్చెడి చెట్టతనమ్ము కాఁగఁగన్. 87

తే. గీ. ఇంతసందియ మేల? యే నెపుడు మనకు, లమ్మనం దెన్నియేనిఁ దరమ్మెలాయెఁ
గాని నేఁటికయోగ్యుఁ డొక్కఁడును బుట్టి, నట్టివిన నిప్పుడిట్లేల యగునొ? చెపుమ?

చ. మనుజుఁడు మంచి కార్యమును మానక చేసెడి పట్ల "హానివ
చ్చు" ననుచు జంకఁగూడ దొకచో నయినన్ చెడు కార్య మూని "దా
న నగును మే" లటంచును మనంబిడ రా "దిది శాస్త్రచోదితం"
బని మన మాచరింపదగు హాని యిటన్ సమకూర దింతయున్. 89

క, అని పలువిధముల బోధించిన సామె యు నొప్పె నంతఁ జన్నిరువురుఁ గై
కొని తల్లిదండ్రులై హెచ్చిన ప్రేమను మీఱఁ బెద్దఁజేసిరి, కడఁకన్. 90

తే గీ. ఎనిమిదవయేఁడు దాఁటకమునుపె యుపన
యనము గావించి బ్రాహ్మణజనములకును
నిత్యమును గావలసినంత నిగమభాగ
మభ్యసింపఁగఁ జేసి రయ్యాత్మజాతు. 91

తే. గీ. అగ్ని కార్యమ్ము సల్ప సంధ్యనొగివార్చ, బడికిఁ జని లౌకికపువిద్యఁ బఠనసేయఁ
"బెంచుకొన్నను నిటువంటి పిల్లవాఁడు, దొరకఁడలె" నంచుఁ దన్నెల్లరు నుతింప.

క. ఆకారము నైశ్వర్యము, శ్రీ కలయును నొక్కరూపు చెందిన కరణిన్
లోకోత్తర గుణగణముల, కాకరమై పొల్చె నయ్యుదారుం డెందున్. 93

ఉ. పెద్దలయందు భక్తి మఱి పిన్నలయం దనురక్తి నేమమున్
బుద్ధులయందు సక్తి చెడుసోయగమందు విరక్తి యెంతయున్
వద్దు నతిక్రమించు కృతులందు నశక్తియుఁ గల్గి యెందునున్
ముద్దునుఁ గారవున్ గొనపు మూలధనంబున నాతఁ డొప్పెఁగన్. 94

మ. అతఁ డీరీతిని గానమందు ఘనమౌ నాసక్తి దీపింప నా
త్మ తదీయంబుగ దానికై యధికమౌ ద్రవ్యమ్ము వెచ్చించుచున్
గుఱుక మొప్పఁగ నభ్యసించుచును దక్కంగల్గు కార్యమ్ములన్
మతి పోనీయక తన్మయుండగుచు నున్మత్తాత్ముఁడై వర్తిలున్. 107

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బ్రథమాశ్వాసము.



# పాణిగృహీత.

## ద్వితీయాశ్వాసము.



పుచ్చాకులదీపక
గోపాదికమార గానకోవిద సుగుణగ
పాలక దాతృత్వగుణ
శ్రీపూరిత నిత్యసదయ సీతారామా!

తే. గీ. అవధరింపు మనంతరం బట్టి సకల, సుగుణసంపత్తు గను మేలికోర్కె యగుచుఁ
బస గలుగుదంపతుల పాలిపట్టుగుచు, నలమె నెల్ల యెడల ననంతాగమమ్ము.

శా. ఆ కాలమ్మున నాతఁ డెయ్యదియొ కార్యం బుండుటం బట్టి తా
న కార్యమ్మును దల్లికిం దెలిపి యా యంగీకృతిం బొంది యి
ష్టకాంక్షన్ బాలుని ముద్దరాలిఁ దన భార్యన్ మేల్కొల్పించి తా
నొక్కండున్ జనె భాగధేయపుర మత్యుత్సాహ పర్యాప్తుఁడై. 3

ఉ. ఆపురిలోన నాటకము లాడెడివారలు పెక్కులుంటఁ దా
నేపని కేగ పట్టిపని యెల్లను దీరినమీఁద నైనఁ బో
వోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుంజవుల్
బాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడియాడుచున్. 4

మ. తనయూరిన్ దనయిల్లు వాకిలియు నాత్మద్రవ్యసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదుభృత్యవ్రాతమున్ జిత్తమం
దున నైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రదంబైన గీ
తనినాదామృతవార్ధిలో మునిఁగి యీఁదన్ జొచ్చె నశ్రాంతమున్. 5

క. గానంపువినికి నెపమున, మానము మర్యాద యనుచు మతి నెంచక యా
యానీచులతో వేశ్యల, నైన గృహమ్ములకు నేగు నహరహ మతఁడున్. 6

మ. ధనవంతుండఁట! రూపవంతుఁడఁట! విద్యావంతుఁ డౌ వాఁడఁ టే
ధననారీమణి వానిఁ జూచి మదిలోఁ దాత్పర్యముం బూననై
నను నాతం డొకకొంతకాల మటు గానంబునే కాని య
క్కనకాంగీకుచకుంభసంభృతులకుం గాఁడయ్యె లోలాత్ముఁడై.

సీ. "ఇతఁ డబ్బుచో నామనుకను నెల్లిండికే చేయింప లేదె! కాంచీకలాప
మతిపురాతన మైనయట్టి నాయుఁలు మేడ గాయింప లేదె! యితండు కస్తూరైన

నీ యమాయికుఁడు మాయేణాక్షి నెనసిన మఱువాఁడు గొనవచ్చు మాన్యభూమి
ధనమునకేమి యీతం డొప్పుకొన్న చో నూరక నాకూఁతు నొసఁగుదాన"

తే. గీ. నిట్లు వృద్ధవేశ్యలు తమయొకఁపలందు, "నెన్వతెన్పహమ్మ నోచెనో యిట్టిభాగ్య
మున" కటంచు మాటికిఁ బ్రశంసను బొనర్ప, దినగు నాతఁడు మిత్త్రులఁ దఱచుగూడి.

ఉ. మున్నరికమ్మునన్ వరుసుమర్వను మేనిహారంగు వేసవుం
జెన్నును గాంచి యెంకరును జిన్నెలు వన్నెలు వొల్చుబోగపుం
గన్నెలు "వీనివంటి యొసకమ్మునఁ బొల్చెడి కోడె కాండ్రు లే
రెన్నఁగ దేనికబ్బనొకొ యిట్టి బొజుంగులఁ గూడు భాగ్యముల్. ౯

ఉ. పాడుకొలమ్మునన్ బొడమి పైకమొసంగినవానికెల్లఁ దా
నూడిగముల్ బొనర్చుచు నయోమయ మైనమనమ్ము దాల్చురో
చేడెల ఘట్టువుల్ ఫలముఁ జెందఁగ నెక్కుడనో యొకండు చే
కూడు ఘటాళిలోఁ గొలము గొప్పసిరుల్ గలయిట్టివాఁ డొగిన్. 10

సీ. గానమ్మునం దింత కాంక్షగల్గిన వాని కేల లేకుండుఁబో! యింతులందు
లేకేమి యే లేమలీల లాతని మదియందు నచ్చెనో యెట్టు లరయవచ్చు
నుండేమొ కాని యేపూవుఁబోఁడికిని నిప్పటికిఁ జిక్కకుండుటచుఁ బలుకరాదు
గానాభినయము లాకాంక్షించినంతనే వ్యభిచారి యనుటయు వలనుపడదు

తే. గీ. యిల్లలికినంతనే పండు వెట్టులగును? నావగింజయు నరభాగ మైనఁ గాదు
విందుమో కందుమో వీనివిధము నేఁటు, రేపటను, దాఁగునే? లంజెకాఁపురములు.

వ. అనుచుఁ బ్రసంగించుకొనుచుందురఁట. ఇది యిట్లుండ,

చ. "నిను మదిఁగోరి యున్నయటి నిదినిక్కముగ నమ్ము" మటంచు నెన్నిగా
తనమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలివొందఁ "యేకాలము నాతికి నియ్యది గొప్పతప్పు దా
నను జెడఁబుట్టి రిక్కలమునంగల యంగన లిట్టిపట్టునన్" 12

ఉ. ఆ కితఁడే వశుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యీ
పోకడలెల్లఁ బోకడచి పూఁలుకాలిబుణము దీర్చుచున్
రాఁకలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమందె యుండు నీ
ఛాకలి మంగలిన్ దనపు చావునకున్ మదిఁ గల్గఁజేయుచున్. 13

ఉ. ఈగతి నుల్కనట్టి తరళేక్షణ యుండఁగన్ మది నుల్కి యాతనిన్
లోఁగొను నట్టిమార్గమును లోఁ దలపోయుచు చారుగాత్రి యుండఁగన్
సాగ దటంచుఁ జంతిలని చానయు నొక్కతెయోని లేదఁటే
రాగము లేనివారు లనురాగముఁ గాంచరె? యొక్కపట్టునన్. 14

ఉ. ఆం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జనువన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నికగాంచిన యమ్మెలాఁడి వా
నిం దనవీధి నేఁగుతఱి నిక్కగనుంగొని లోఁగొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. 15

తే గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ, దగినమేటియుపాయము మొదవమి జాణ
గానఁ దనకెంతయును వశుఁడైనయొక్క, విటునితో మంతనమునఁ దానిటులు పలికె.

ఉ. కన్నెఱికమ్ము గాకమును కామ మొకించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకితనమ్ముల రాయనమ్మ లోఁ
గొన్నవిటాగ్రగణ్యుఁడవు కోటు లొసంగియు నాఋణమ్ము, నీ
వెన్నఁడు దీర్పనేర విటు లెవ్వతె నిన్ను గణించుఁ? జెప్పుమీ. 17

క. నగలా! నాణెములా! యే, నగలాడికి నైనఁ గాని వలపు నిలుమనే?
మగవాలికన్న హీనమె?, నగరే? నను వాకొలమ్మునం గలకన్నెల్. 18

ఉ. పిన్నటనాఁటు నన్నుఁ గొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో!
కన్నెఱికమ్మువాఁడు నొకకాసును గొంగునఁ గట్టనేర్చితో!
వన్నెలుఁ జిన్నెలున్ గలుగ వచ్చెనె? భాగ్యము లేర కాఁడ! ని
న్నెన్నఁ బనేమి? వాదుమనసే కడుమెత్తని దెన్నిభంగులన్. 19

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జనయిత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్టలిడికొన్నధనమ్మది యెల్ల నల్లయుం
బెల్లముగాక నీకతన మెల్లఁగ డొల్లఁగఁజొచ్చె నింతకున్
దల్లికిఁ గాని పోకిళులఁ దాఁ జన రోఁచలి పేరు దెచ్చునే. 20

శా. "అమ్మా! అంకమునందు నీవునను జా నావంతయుం జల్పఁడే
నమ్మం బోకుము రాజునైన నొరు నైనంగాని నీచేతిలో
సొమ్ముం బెట్టిననాఁడు దక్క మొగముం జూపెట్టకే" యంచు నే
ర్పు మ్మాయల్, చెవి నిల్లు గట్టుకొని పోరెన్, దల్లి నిన్బాపఁగన్. 21

ఉ. అయినఁ దదేమి నీ వనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాప్రియాస మిటుఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ బో
నీ నెల కొక్కరూపికయు నీ విడ నెంచ విఁకెన్ని వాళ్ళు ని
న్నాని చరింతుఁ? దల్లియును నన్న కుటుంబము దిట్టిపోయుఁగన్. 22

ఉ. ఈపురిలోని మాకులమునింతులయుం దొకవిద్దెఁ గాదునూ!
రూపమునందు నేరుపున రూఢిగ నా కెనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదినైతి నీకతన, నీవును రా విఁకఁ గొన్ని వాళ్ళకున్. 23

తే. గీ. జనని నానంద మొనరింపఁ జాలనైతిఁ, గొలమువారలలోఁ బెద్దకూఁతు నైతి
చేలనై పరివారలఁ బోలనైతి, నేల వేయును? నీకె యిల్లాలినైతి. 24

చ. ఇతరకులమ్ముగం బొడముఁగింతులఁ జిన్నటినాఁడ తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పుచుఁ నొండొకజాతిపుర్వ్యఝుం
కృతుల నకుల్ స్వజాతి నఱించినభంగిని సానిఁ జేయు నా
పతి తమ కత్త దేఁతయును సానులకున్ దలవంపు నింపుచున్. 25

చ. అనుచు నొకప్పుడున్ వినని యుప్పులుకుల్ చెవి సోఁకినంత న
వ్వనితకు దాసుఁడైన విటవల్లభుఁ డల్లన గుండె జల్లనన్
గన లుదయింప నాఁచికొని తా దని యా నవి పల్కలేక లో
వనుకొని నిట్లు "ఛీ! పడపుటుంగన లిట్టిర" యోరికేనియున్. 26

చ. ననుఁ గనికాని భోజన మొనర్పను నన్నిటికాని యన్యమున్
విన దొకవేళనైన నను వీడి యొఱుంగదు గర్వ మన్న మా
టన విననాదు దీనివ్యాపయం బిపు డొక్కటిలోన మాసె, "రా
వనితల పేర్మికల్ల" యనువార్తలసత్యము లెట్టులో? భువిన్.

చ. జనని యొనర్చుబోధములచందము దాఁ దలకెక్క యుండునా?
తనచెలికత్తియల్ పలుపుతంత్రము లాత్మఁ గలంచియుండునా?

ననుఁ దలఁదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుందునా?
కనికర మింతలేక యిటు కాలుఁ ద్రేచుట కేమిహేతువో. 28

చ. తనపసిప్రాయమందు విటు దైవముగాఁ గనునవ్వెలందియే
చనఁ జన మోటువాఁడై యొకచందమునన్ గనుఁ జుల్కఁజూచు లోఁ
గినకొలఁదిన్ మఱింత పణకించుచు సేవకుకన్న హీనుఁ గాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁ గాక మఱొక్కటఁ గల్గ నేర్చునే. 29

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే. గీ. అడిగినను దమ్మిడీ ద్రవ్యమ్ము లడుఁగకున్న, రాకపోవునే? మర్యాద రాదుగాని
మగువ! "యేడ్చినదానికి మగఁడువచ్చి, యేపలాడికినదానికి రాకపోఁడు."

తే. గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క, మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె? యీసామెతనునీవు వనజనయన! "నూఱునోములు అంకుతోఁ దీఱిపోవె" 31

చ. తన మనుమాట వేశ్యకును దానికిఁ దోఁచిన నీడవోలె నుం
డినయది యే, తగుంగతి గడింపవలెన్ సమయమ్ము మాని, యీ
నిరయపు డావు పాలిడదె? నీటి నొసంగదె? వర్ష కాలమం
దున జలదమ్ము, లింత మదిఁ దోఁచని దానికిఁ జెప్పనేటికిన్. 32

క. అన జలజాక్షియు మోమున, మనువగవు సెలంగ నోయనుంగుబోఁటీ!
నిను ధన మిమ్మనుట వస్త్రనె? యెక్కడఁదెత్తు? వది, యెఱింగింపు మొగిన్. 33

వ. ఇట్టిపట్టునఁ గృష్ణుఁడను నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల దాకర్ణింపుము. 34

మ. జనన మ్మాదిగఁ బుట్టినించితివి గా! చౌర్యమ్మె కార్యమ్ము గా
ధన మెక్కింతయు నీయకే వ్రజసతీదాంపత్యముల్ గొన్న నీ
జననంబుల్ పదికోటు లిబ్బుగను దీర్చన్నేర్చునే? యట్టి, నీ
కును నేమున్నది? యేమొసంగెద? వహా! గోపాలచూడామణీ. 35

వ. అని యాజలజాక్షి యతనిన్ గొంతబుజ్జగించి మఱియును. 36

మత్తకోకిల. గాన మన్ మిముచేతఁ గొందఱేఁ గన్నెలన్ వలపించి యా
శ్రైవి పాట్యమటుంచుఁ గొందఱి బాలలన్ గిఱుద్రిప్పుచున్

మానహానికరాప్రవీణతఁ జూపి కొందఱేఁ బోరిడలన్
మానభంగ మొనర్చు నీవు మా కొసంగెడి దేమిటో. 37

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్ష మెయిన్ జిననాఁటనుండియున్
బూవిలుకాని ముచ్చటలఁ బొందఁగలే దిది నిక్కువంబు, నే
నేవిధినైన జన్మ మిది యెంతవఱకుండునో యంతపట్టు నీ
తో విడకుండుటే నిజము తోఁబడి విఘ్నము లిందు వచ్చినన్. 38

క. మనచెలిమికి భంగ మ్మెందును గల్గకయుండునట్టి త్రోవను ద్రవ్యం
బును నార్జింపఁగవలె నే, మన! ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్. 39

ఆ. వె. "కూరుచుండి తినిన గుల్లగోపురములు, నాటు" యెన్ని నాళ్ల కగును నింట
నున్న ద్రవ్య మింక నొండొక్కసమపాయ, మెద్దియేని జూచుటే హితంబు. 40

క. ధన మెంత నీవొసంగిన, గొన నది యేమంటివేని? గూఢమ్ముగ వ
ర్తన గల్గుప్రియునిపై మన, మొనసినగతి నుంచుకొనిన నెనయుదు వింటే. 41

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నివగల్ మొయినిండ వైచినన్
గాంతుఁ డొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రోవెలంది, కీ
యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగరహో! జమీను దా
ర్లంతిపురమ్ములం దిడుదు రందును మానవు మాప్రవర్తనల్. 42

గీ. అభినయమటంచునో గానమనియొ వైద్యమనియొ మఱియెద్దిసామిష యనువుపఱచి
తనకుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున, కళ్రమమ్మున రప్పింతు రబ్జముఖులు. 43

క. అది యేమికర్మమో తాం, బదిలక్ష లొసంగనేని మదనుండైనన్
గుదురదుమన మిక్కుటకల, కద నెఱిఁగినయట్టివిటునియందుం బోలెన్. 44

మ. ఇదియే నిక్కముగాకయున్న విను మీ వీయూరనే కాదు తాం
బదియూళ్లన్ గనఁగొమ్ము ద్రవ్యమహితుల్ మాజాతి పూఁబోణులన్
బదిల మ్మొక్కతి నుంచుకొంటయును నప్పద్మాక్షు లింకొక్కనిన్
గదికిన్ దూతిక నంపి తెచ్చుకొనుటే గన్పట్టు నీ కెల్లెడన్. 45

ఉ. కొందఱు వెట్టు లయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగు జీత మిచ్చి యిడిపోదురు వాని కొకింత యిచ్చినన్

జందనగంధికిన్ బిటునిఁ జయ్యన వాఁ డొనఁగూర్చుఁ గొన్నిచో
ట్లందగ వాఁడె యా విటుఁడు; లంజెలనైజము లెన్న నేటికిన్. 46

ఉ. సమ్మతిగాని నీకు నొకనాతిచమత్కృతి చెప్పెదాన మా
యిమ్మన కావలన్ గల మృగేక్షణ నాథుఁడు శయ్య నుండఁగా
నమ్మకచెల్ల! యింకొకని సచ్చట నే రతిఁ దేల్చె నిద్ర నొఁ
దమ్మహితుండు దీపమును నా ఱడు కాంతల కెంత లిప్పనుల్. 47

చ. ఒక వెలచాన లేయనుచు నూహ యొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ యందు వెలసుందరు లిందులకై జనించుటన్
బ్రికటన కెక్కెనేనియును బాధయు నంతగ లేమిఁ జేతు రి
ట్టి కుటిల కృత్యముల్, విటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్. 48

ఉ. నావుకు నాతఁ డిట్టులను నాతిరొ! పిన్నటినాఁటనుండి మీ
రోవెలఁదుల్ పొనర్చు పలురోఁతలు నేను నెఱుంగువాఁడ నీ
వేవిధి బోధచేసెదవొ యేర్పడఁ జెప్పుము ద్రవ్య మాగతం
బౌవల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ దక్కుచున్. 49

క. అన జలజాక్షియు మనమునఁ, దనకోరిక సెల్లునని ముదం బందుచు నే
ర్పున నిట్టులనియె దానిగ, సన నేమిటు నవ్విధాత సలిపెన్ బళిరే! 50

చ. అరసితిఁ గాదె! నీ వలయుదారుని, నాతఁడు మేటిసంపదన్
ధరణిపునంతవాఁడఁట యుదారత నామమె చెప్పుచుండ నొం
డొరులు వచింపనేల! యతఁ డొక్కకనాఁ డొకనాతియింటికే
గి రహిని గానమున్ వినెనికీ లది నీవు నెఱుంగ కుందువే. 51

తే. గీ. ఇప్పటికి దేనియందు నపూర్వమ్ము కాని, మదిలగింపమి నిరుక్కవం బదియు నొక్క
నిముసమున నేను లోఁగొందు నికు నాకుఁ, దగినద్రవ్యమ్ము సాధ్యింతు దానఁ జేసి 52

క. కావున నాతనితోఁ జన, వేంధమునన్నైనఁ జేసి యిరువ్యడ కతనిన్
రావింపుము తక్కింపని, నీ వేమియుఁ జేయవలదు నేన యెఱుఁగుదున్. 53

ఆ. వె. అతనితగలు గాంచి యామీఁద నీమిఁది, పేర్మి విడతు నంచు భీతి నీకు
లేశమైన వలదు, లేఁబ్రాయమునఁ దగు, లొక్కన్న వాని విడచుగోల గలదె.

చ. అతఁ డొకవేళ నన్నుఁ దనయంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపువెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ
కుతుకము నెట్టులేని సమకూర్చెద వేయును నేల? వాని "నా
ప్రీతి" యనిపించెదన్ వలపుఁ బెంచి క్రియమ్ముగ నీకు రాఁగదన్ 55

క. అనవుడు నాతఁడు తనదువ్వదన మించుకఁ జేసికొనియు ధన మీలేమిన్
దన కది యోగతికిన్ దక్కునఁ దక్కు దటంచు నెంచి కీలెఱిఁగి యొగిన్. 56

ఆ. వె. అది యకృత్యమగుట నాత్మ నెఱింగియు, దానివలనఁ గలుగుతగులు త్రిప్పు
కొనఁగలేక "వల్లె" యని యొప్పుకొనియె నెవ్వరికిఁ దుచ్ఛవిటులు పాలుపడరు? 57

తే. గీ. రాణి నొరుఁ గూర్చు మున్న భళ్లాణనృపతి
తనసతికిఁ దాన దూతయై చనియె నలుఁడు
పరుఁ గవయఁ బొందుఁ డిడె నాజ్ఞ భార్య, కంత
కన్న ఘనుఁడనె? యిది భార్య గాదు నాకు. 58

క. అని మనము సమాధానంబును బొందఁగఁ జేసికొని సుముఖుఁడై నెలమె
ల్లనఁ, జని యొకదినమున నిట్లనియె సుదారుఁ గని మైత్రియుల నమకతనన్. 59

మ. తమ రీయూరికి వచ్చు కార్యమది సాంతం బాయెనే? యేపశ్చే
షము లీప త్తనయందుఁ గాంచితిరి? వాస మ్మిచ్చటన్ మీకు సౌ
ఖ్యముగా నున్నదియే? యిటన్ దమరు నింకన్ గొన్ని నాళ్లుందురే?
తమ రేగన్ మమ బోఁట్రిమిత్రులకుఁ జింతల్ సెప్పఁగా శక్యమే. 60

శా. గానమ్మున్ వినుచుంటి రాఁగద! సమగ్రప్రజ్ఞ యద్దాన నే
మీనాక్షీమణి కొప్పు! నాట్యమున నేమీ? యన్యమం జేమి? యే
యేనాళీకముఖుల్ నటింపఁ దగువా రీవీట? మీవీట్రిలో
నీ నాట్యాభినయాదికమ్ములకు హాయిన్ జెందువా రుందురే? 61

చ. అనవుడు గానమందుఁ గల రంగన లెయ్యెడ నెందఱందఱో
యనుకృతిక్రైన లేదభినయమ్మున నొక్కతె మాపురమ్మునం
దున, నన నేల? దేశమది దుర్గతిభాజన మొక్కదీనికే
పనికిరాకాని యెయ్యెడ శివేకిని గన్పడ దందు నెందునన్. 63

ఉ. చామనచాయయున్ మిగులఁ జక్కని చన్గవ లేఁడిమూపు ల
క్కామునికైననున్ వికృతి గల్పఁ జేసెడి సోయగమ్ము లీ
లామధురోక్తిచాతురి కళాకలనమ్ము బెడంగుఁ బ్రాయమున్
మోమునొయారమున్ భువనమోహనమై తగు నవ్వెలందికిన్. 73

తే. గీ. పేరు జలజాక్షి యది నేతిబీఱకాయ, గాను జలజమ్ములను దెచ్చి కమలసూతి
తాపసము సేయుఁ శిల్పివిధమ్ము దోఁప, నతికె మోమున ననుటొక్క యక్కజంబె. 74

గీ. అనుచు దారుండు వల్కు "నీ యతులగుణమె, యున్న నేవిన్న యవియు నక్కన్నె కడను
మనము పోవచ్చునో? యినిమఁ డెవఁడునా, బెట్టికొనియుండఁడో? వానికట్టులేదొ"

చ. అన నతఁ డిట్లు వల్కు "నది యాకొలమందునఁ బుట్టఁదగ్గ జ
వ్వని యని యెంచఁబోకుఁడు భ్రమమ్మునఁ బూవుగుత్తోఁటలోని చం
డనలతయున్ గలంజప్రవనమ్మున నౌతుఁ సీమతల్లి, దా
నినడతచందమున్ వినుతు నిక్కము మీమన మక్కజంపడన్. 76

ఉ. కన్నెటిక మ్మొకానొకఁడు గైకొనె, వాని యదృష్ట మెట్టిదో
చెన్నఁటివాఁడుతప్ప నలచేఁడియ రెమ్మ్వొరొ వాఁడెపెంకఁ డా
దిన్నియొ యూరి యాపయిని నీ! యని యెందులకో విరక్తి లోఁ
గొన్నదివో లెఁ గైకొనదు కోటు లొసంగెడివాఁడు వచ్చినన్. 77

ఉ. దానికిఁ బ్రాయ మిమ్మ్యెడల దగ్గరదగ్గర నిర్వదేఁడు లే
మానిని యుండు నిట్టిక్రియ మానవలోకమునందుఁ? దన్మనం
బేనరబాధనూనపయి నేర్పడియుండెనొ? యెంతకోస మీ
మానము తాల్చెనో? యొకులమానస మేగతిఁ గాననయ్యెడిన్. 78

సీ. ప్రాగ్వరీతిగాఁ బద్యమ్ములను వ్రాసి "వ్రాయుమీ? లా" యంచుఁ బంపువారు
యుత్తరమ్మును వ్రాయ కుండి యెచ్చటనైనఁ గనుపడ్డఁ "గరుణ లే" దనెడివారు
లేనిపోనిపని గల్పించుక యింటిముట్టును బడి తిరుగాడి చనెడివారు
అంగీకరింప లే దనెడికోపముచేత గోడకుఁ గాకితాల్ గొట్టువారు

తే. గీ. ఇంటిపై పెద్దలనువైవి యేగువారు, గొట్టవలెనంచు లోలోన గొణుగువారు
నై యుదరు దానిపొందుఁ దామందలేక, వినివి వదలిరి యాజోలి వీట్టివిటులు. 79

మ. ఎవనిన్ ధన్యనిఁ జేయనున్న దియో? తా నెవ్వాని తారుణ్యమున్
గవిదర్భ్యం బొనరింపనున్న దియో? యే కాంతాశిరోరత్నమున్

పవిత్రాత్మ యుడికింపకున్నదియొ! యే సాంగజ్ఞు సంసారసా
రవిహీనత్వము వాపకున్నదియొ? నేరం బోల దూహింపఁగన్. 80

క. అనవుఁడు "దాదృశగుణగణ, ఘనుఁ గనుఁగొనుటయును గొంత గణనీయము నీ
వెనువెంట నెప్పుడేనియుఁ, జనుదెంచెదఁ దెల్పు తగిన సమయ" మ్మనుడున్. 81

క. "కనుఁగొని తెల్పెద" నని యా, జనవంచకుఁ డరిగె దాని చక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నా,తనమాంద్య మ్మయ్యె నారదుఁదరి కరుదెంచెన్. 82

క. దానియిలు సేరిన ట్లుద్దానిన్ గనుఁగొనిన యట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున, దానింగను దానినెంచు దానినుతించున్. 83

తే. గీ. మునుపువినినప్పుడే కొంత మొలకఁగనిన, వానియనురాగవృక్ష మివ్వాలికతన
నిపుడు తిరిగియు వింటచే నెదిగి వింత, సరణి నొక్కింత శాఖోపశాఖలలరె. 84

క. అట్టిపొడ నింతకుమున్ను జలజాక్షిఁ గుఱిఁచి ప్రశంసించినవంచకున కొక్కింత శత్రు
వగు మతియొక్క విటుం డిట్లను. 85

తే. గీ. ఎవనితో నెవ్వఁడేని దన్నింతకంత, యడుగకున్నప్ర మందిరే యడుగును గాక
చెట్టుమనుఁ గాక తనయంతఁ జెప్పఁబోవుఁ, వానికన్నను బేల యొండైనఁగలఁడె?

క. అయినను మీ శ్రేయస్సు ప్రధానముగాఁ గోర మీదుతలఁ బెక్కంగా
నానేర్చినంతలో మీ, కేనొక సంగతిని జెప్ప నెంచితి వినుఁడీ. 87

క. ఏటుక రవలోఁ జిన్న, ప్పటినుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటియైన దక్కక యెఱిఁగి, పటుమతి నని సన్నుతింగవలయును మీరల్.

క. విధవల నేకులు గల, "రా, విధవలలో మొట్టమొదటివిధవ యెవఁడు" నా
నధమపువేశ్యలఁ గూడెడి, విధవయె! నాయనుభవమున వినిచెదఁ జూఁడీ. 89

క. పేరిమ మొకించుక లేకయె, కాముకు గలవనితవలెనె కాముకైతా
నోమసుతునైనఁ గూడెడి, సామాన్యం గూడువానిజన్మము ఘనమే? 90

తే. గీ. ఇహపరమ్ముల నెఱుఁగని హీనమతులు, కష్టసుఖముల నెఱుఁగని కఠినమతులు
మానమర్యాద లెఱుఁగని మందమతులు, తక్కువెలవెలఁదులపొందు దలఁపరెందు.

ఉ. దండుగదోషమలో సకలధర్మము లీగ విడనాడి బోగపున్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని బ్రేరణ చేయుచున్న యా
కండలకొద్దు దానికి పరాసిగా ధన మీయకున్న బ్రి
హ్మాండము మున్గిపోయినటు లాపయినేడ్తుగు సర్వహీనులై.

ఆ. వె. ఉండఁ గొంపలేక, పండఁ బాన్పులేక, యొడలికప్పుటకును నుడుపు లేక
మొండితనము పూని దండివార మటంచు, బండవిటులు దిరుగుచుండఁ గనమె.

శా: వేసారన్ వవరించినన్ మనము తృప్తిం జెందఁగాఁ బోదు వ్య
త్యాసమ్ముల్ ప్రబలించు బుద్ధి చెడు నాయాసమ్ము మెండౌను వి
శ్వాసమ్ముల్ చెడిపోవుఁ గోప మొదవున్ వాంఛల్ తుదల్ముట్ట వీ
స్త్రీసాంగత్యముకన్నఁ బాడుపని వేఱేలేదు చర్చింపఁగన్. 94

శా. వైకుంఠమ్మయి శంభులోకమయి దేవజ్యేష్ఠు నావాసమై
నాకంబై నరలోకమై నరకమై నానాఁటికిం దోఁచు సీ
రాకాచంద్రముఖీసమాగమమునన్ బ్రాక్షేత్రముల్ వోలె సు
శ్లోకుల్ పండితులున్ భ్రమింతు రిది యిక్షుప్రాయ మూహింపఁగన్. 95

తే. గీ. మొదలసంసారమే కడుమోహమయము, గాన దానికె యొప్పరఖండమతులు
దానిలో లంజెవలని యిందైనసుఖము, చెప్పఁగా? శత్రుసఖుని నీచేటు వలదు.

క. తలిదండ్రులు మోదింతురొ! కులమును బ్రతిష్ఠ గలదొ? కులకామిని లో
వలమట గాంచదొ? యేమిటఁ, గలుగున్ సౌఖ్యమ్ము లంజెకాఁపురమందున్!

క. తనువు చెడు మానమడఁగున్, ధనము నశించుఁ దనకు దర్పముఁ బోవ
న్మనుజు నబ్బు శాద మెనయున్, ధనకాంతలు సేర్పనట్టి తప్పులు గలవే? 99

క. “మనతలన పుట్టెనే? యిప్పను” లని యొకవేళ మీరు ప్రశ్నింతురు, నై
కొనవలె నటులేనియుఁ దాఁ, దనకన్నన్ జిన్నదానిఁ దగియెడివానిన్.

క. “వచ్చియు రానిపదములును, వచ్చియురాఁట్టి ముద్దుబాలురపలుకుల్
హెచ్చగు మోదమునిచ్చును” నచ్చును రసికులకు నవియె నవనవగరిమన్.

క. ఒఱఁగినచనుఁగవ గలిగిన, తరుణిం గవగూడుకన్నఁ దఱచై కదుఁ గ్రి
క్కిఱిసినచనుఁగవ గలిగిన, తనుఁణులపదతాడనము శతగుణము మెఱుఁగా.

ఉ. గిల్లినఁ బాలు గారుకలికిన్ గరఁగూడిన సౌఖ్యమబ్బుఁ గా
కెల్లెటఁ ప్రాయ్యులును నెత్తరతత్తర చేసినట్టి యా
యల్లరిబోట్లఁ గూడ సుఖమబ్బునె? మాటలతేట దక్క నీ
యుల్లమునందుఁ జూచికొనుఁ డూరకవాఁగెడివాఁడఁ గాఁ జుఁడీ. 102

ఉ. “పున్నమనాఁటి చందురునిపోడిమి మంచిది గా” దటంచు నే
నెన్నఁడు గాని పల్క నిఁక నేమన? నద్ది క్రమక్రమమ్ముగా

సన్నగిలుఁగా, ద్వితీయ నగుచందురుఁ డన్నా! గ్రమక్రమమ్ముగా
నున్నతి చెందు భేర మిదియొక్కటి పొందదను న్నవోఘమా. 108

తే. గీ. అందులో మీర లెద్దానిపొందు సేయ, నెంచుమంత్రిరో యదియును మీకీడుగాదు
దానికుపకార మొనరించుతలఁపుగలిగి, వాఁడటులు సెప్పె నేనాఁటివనిత యదియు.

తే. గీ. ఇపుడుమీతోడఁ జెప్పిన యాపద్బుద్ధుఁ, డెంమి నివ్వన్నెలాఁడికి వలపుమగఁడు
పేరుగుద్చ్చంగ నేల? యాయూర దీనిఁ జూడకున్నట్టివార లెవ్వోట లేరు.

క. ధనవాంఛలేకయే యివ్వనితామణి యీశు వమ్ముచలికే విటులన్
గని పిల్చి కూడఁజొచ్చెను, దన కొలమున కన్నెల్లఁ దను నవ్వంగన్.

ఆ. వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁదీసిన, మొదటిమగని సోదె మొదలు పెట్టు"
నన్నరీతి నిది రసాభాస, మందును, నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు.

క. చాతుర్యాస్యలలో యతు, లేతీరున బొంకెదరో యదే తీరున నే
ర్పాతరుణులు వయసు గడుపన్, ద్రాఁతురు; తలక్రిందుమాడఁ దగు నటు నిచటన్.

ఆ. వె. తనకుఁ బెద్దయైనతరుణితోఁ గూడుచు, దాయ వణఁగఁ జేయ టుట్టులుండ
"దాని కేటివినితగు! లేదకే?" దంచు, నగుదు రెల్లవారు నగడు చేసి.

తే. గీ. కడఁగి "కడవంత గుమ్మడికాయ కత్తి, పీఁటకగు లోఁకు"వనియట్టి పోటి నొప్ప
టొప్పినంబేనియును దీని నొప్పబోకుఁ, డింతకన్నను జపలురా లెందు లేదు.

క. అన నతఁడిట్లను "నీమన్మథును గలవే?" చెప్పదచ్చు లోఁబడియెడి య
జ్జనులు దొరకఁగ వేశ్యా, జనులకుఁ గలదోసఁగు లితరజనులకు లేవే? 111

తే. గీ. దేనియందైన ననుభూతి దీఱుపిదప, దాని నిరసించువాండఁత జ్ఞానిగాఁడు
మొట్టమొదటన నిరసించు నట్టివాని, నెన్నఁగాఁదగు వారలు నున్న జగతి.

క. అనిపలుక నాతఁ డంతటఁ, జనియె నుదారుఁ డిటులోఁనఁ జర్చించె "నాకం
డను మోదించినవస్తువు, జనుఁ డింకొకఁ డొప్పఁడిదియు సహజంబె ఎందున్." 113

క. చందురుకాంతిం గని లో, నెందఱు సంతోష మంద? రెయ్యెడలను దా
మందురె? పంకజములు, జగమందఱికిన్ ముదమొసంగునది లేదెందున్.

ఉ. దాని పవిత్రరసన్ గుఱిచి తద్దయు నాతఁడు నచ్చఁ జెప్పన
న్దేవరునైన నయ్యతివ యేలికొనన్ గమకింప దన్నమా
టే నిజ, మక్కతమ్ముడన యాతని నాతరుణీవశంసమం
దూనెనయాయు, నిక్కమది యొక్కఁడు సెప్పెడిబుద్ధు లొప్పునే? 115

ఆ. వె. దాని కనినదాది తన్మయుఁడయి చిత్తవృత్తి విస్మృతాన్యవృత్త మయ్యెఁ
గనిన యప్పు డేమి గనున్నదో, బుద్ధి కర్మ మనుసరించుఁ గాదె! యెందు. 116

సీ. కాంతలతోఁ బొందఁ గామి నీకక్కమా! యటులైన నేల పెండ్లాడవలయు?
అన్యకాంతలఁ గూడు టనుచితం బందుమా! యటులైన నిది యొఁగా దన్యకాంత
వెలయాండ్రచెల్మి తప్పిదమౌనటందుమా! యటులైన వీండ్రెందు కవనియందు?
సత్కులీనులకు నాచారంబు గా దందుమా! యింతలోన నేమాఁ గులమ్ము?
తే. గీ. కలియుగమ్మున నీరీతి కట్టుఁబాటు, గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యాపెఁ గొన్న దుష్యంతున కందునిందు, నేమి లోపమ్ము గల్గె? నిం దేటిశంక!

చ. పలువురు నొక్కచేడియకుఁ బాల్పడు టొప్పనుగాని నేమముల్
వెలసెడి యిట్టియుగ్మలిని వీధిమొగమ్ము గనంగ నీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁగూడదె? దీన నమేమిలోపమౌ?
గలిమికి నెందునున్ ఫలముగాదె? మహోన్నతభోగభాగ్యముల్. 118

ఉ. భోగమునందు నిచ్చలును బొందనివారిల లేరు దానికిన్
ద్యాగము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె దానిలేమి న
య్యాగమవేత్త లీసుఖము నందఁగలేక స్వరీతి నెల్లరన్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లీక్రియ వ్రాసి రీసునన్. 119

క. ఒకని ధనమాటుచేఁ బర, వికచాంభోజాక్షి నెనయువిధ మది దోసం
బిఁక సకలజనులకును దా, నొకగతి ధనమగుట వేశ్య నొందందగదే. 120

క. ధననాశనతత్పరనాశన, ఘనతానాశనము లిందుఁ గలుగుట ధ్రువమై
నను నెల్లగనుప నయ్యెవి, పనుపడు ననరాదు భాగ్యవశమగుకతనన్. 121

తే. గీ. ఎందు వేనియు సందియమైన నుండ, మనుజుఁడు పవిత్రవర్తనమ్మున గొనఁగవలయు
గాని దీర్ఘయోజన కొలగాదు "సంశ, యాత్మనశియించు" నని పెద్ద లంద్రు గాదె.

ఉ. సారవిహీన మైనభవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్వితేటలును జాణతనమ్ము నందముఖ్య మీ
తీరు స్వతంత్రలైన సుదతీమణులందుఁ బొసంగు, తాం ద్రిష్టో
చారిణులంచు మానుకొనఁ జాతురి యింకెటుఁ జూడఁ గల్గెడిన్. 122

ఆ. వె. దొసఁగులెన్నియేని బొసఁగుఁగాకెందును, గలలఁ గానవిద్య కన్న లేదు
అంగనాజనమ్మునందు రూపాజీవ, కన్న ఘనము దనుపుకన్నె మున్న.

చ. అదియుఁ గాక వస్తుగుణ మారయ నెంచిన దేనికైన నై
ఱ్యాది సహజంబొ దానిఁ గననౌనటు, వేఱొకచోట నించుమిం
చు దనకు నట్టిసంగతియె చొప్పడినన్ సహజప్రచారమై
యొదవమిఁ దెచ్చిపెట్టినటు లుండకమాన దదెట్టి భంగులన్. 124

క. ఆమనిఁ బోడము రసాలము, తో మఱియొక ఋతువునందుఁ దొడగునదియు సౌ
నామధురిమ మిడ సేరదు, పో! మహి నది మేనమామపోలిక యగుటన్. 125

క. ఇటు పలువిధముల యోజిం, పుకు నారంభించునంత మొట్టమొదటి యు
ద్విటుఁ డేగుదెంచి "యటకే, గుటకే" యని చెప్పుటయు నగులొల్లసనపోర్క్కన్.

తే. గీ. అందులకె సిద్ధమైయుంట నగఁడు వల్లె, యనియె నంతట నజునాఁడు నడుగుదెంచె
నర్మసఖుతోడఁ గూడి యన్నాతిమిన్న, సదనమున కేగె నభినవయూనసక్తి నతఁడు. 127

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందు
ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## తృతీయాశ్వాసము.



సరసతర, రుచిరగీత,
స్వరసాదర లక్ష్మణాగ్రజన్మగృహీతా
గురుతర భాగ్యసమేతా,
చిరకీర్తిప్రాప్తినామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బాలతాంగి, యెప్పటివలెను మామకయేసక మెసఁగు
తనదు దేహమ్ము గేహమ్ముఁ దదధికముగ, సొంపుగులుకనలంకృతుల్ చొనిపి పిదప. 2

క. తత్తరపాటుగమ్మల న, త్యుత్తమగతినటవరించి యొక్కెడ దదా
యత్తమ్ముకుచిత్తమ్మున, నత్తరుణి గవాక్షనిహిత మగుచూ పొలయన్. 3

తే. గీ. ఎదురుమామయు నున్నంత నిరువుగదటి, కేగి రేగుటయును దరుణేందువదన
దవ్వులన కాంచి కేళీసదనములోని, కంతలోఁ జనె సిగ్గున్న యబలవోలె. 4

తే. గీ. అద్భ్యావారుని నొక యుచితాసనమున, నుండఁగాఁజేసి నర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాప మోయబల! యతని, దీసికొనివచ్చినప్పు డీతీరు తగునె?" 5

వ. అన నాటక్కరికరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్నయెడఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొకయింతయుఁ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును డగ్గరైన య
ప్పూరుషుమోము గన్గొనినఁ బోవు నదెంతటి ప్రోఢకేనియున్. 6

క. నమ్మెదవో లేదో యాతని, నెమ్మొగముం గనినయంత నే మదిలో నో
క్కమ్మడిగ లజ్జ వొడమెన్, జిమ్మన నది వదలి చనను చేవదగులుటన్. 7

క. పసితనమునుండి నన్నున్, గుసుమశరవిహారములఁ దగుల్కొల్పిననీ
దు సమీపమ్మున నితని, దెస మొగమెటు త్రిప్పి నిలువఁ దేఁకువగలుగున్. 8

క. పలువురప్రియురాండ్రొక్కెటు, గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డెదిరసమున్
దొలఁగింపదు కామినుటు, నిలుచుటకున్ దగదు రసము నీరసము నగున్. 9

వ. అను నక్కలికి ప్రియసంగమ్మునకడ్డుగా నతం డిట్లను.

క. అతఁ డదటు నే నిచటు నుం, టు తగదు నే నెఱుఁగనట్టి టక్కరితనమా?
యాతివ! యిది, సిగ్గు మీజ్యాతి తరుణులకు నున్న యంత తెల్లం బెన్నన్. 10

తే. గీ. అని యతండుగుటయు నత్యుత్సవమిన్న, యల్లనల్లన వాకిండనట్టియెడను
నరిగి యటుఁ గంబ మొక్కటింతయడ్డుగాఁగ, నోరగానిల్చి కాంచుచునుండునంత.

క. తనమది సద్గానిఁ గనుఁ, గొను టెప్పుడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జిం
తనసేయు నయ్యుదారుఁడు, వనితబెడంగంతఁ గాంచి వహ్వారె! యనుచున్. 12

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నామేడనుంచ, నేర్చితివయేని నాయవన్నెయును వాసి
కలుగు జన్మవమిది సార్థకత్వమందుఁ, గలిమిగలుగుటకును సుతగలుగు ఫలము. 13

క. తగు కాంతతోడఁ బొందున్, దగులని మనుజునకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును, భవద్వ్యంచితము లధికపాపాస్పదముల్. 14

ఉ. ఈతరుణీమణిన్ గలసి యించుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కామకల లెప్పుడు చింతనసేయుచున్ లస
ద్రీతవినోదముల్ గనుచుఁ గేళల మోదమయాత్ముఁడై వయ
స్స్ఫూర్తికి సార్థకత్వ మొదవించునో వాఁడుగదా! కృతార్థుఁడౌ." 15

క. అని యూహసేయు దానిన్, జనరాలోకన మొనర్చి మరియు మఱియు న
వ్వనిత కిలసాటి లేదని తనలో, నానందమందుఁ దనియము నొందన్. 16

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁడిట్టు లను "జగాన, నభినయమ్మున నీపాటి యుందరతె
గానఁగాదు గానమ్ముఁ గవనళక్తి, దానికిన్ దోడు దీని కేతరుణి లేదు?

క. ఎదుటన్ జెప్పిన నతియని, మది నమ్మనటతికిఁ దోఁచు మాటలిఁకేలా!
గుదిగూర్చె నన్నిసంగతు, లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్. 18

క. అని జలజాక్షిం గనుఁగొని "వనబోణిరో! సిగ్గు వారసాతికిఁ దగునే?
కనుఁగొన వచ్చినవారల, మనమెక్కన్ మెలఁగరుఁటు మరియాదటవే? 19

క. సిగ్గుగల వారకాంతయు సి, గ్గెఱుఁగని కులాంగనయును జెడుదురు నీవీ
యొగ్గెఱుఁగ నేర విది యొక, పెగ్గ యనుచు గునిసె దింపుఁ బెంపుగలుగునే. 20

తే. "సగముచచ్చి యంతయుఁజచ్చి జగతిగాన, హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మునకట్టిద యదియుఁగల్గి, యింతసిగ్గునడఁచను నె? రోయిగురుబోణి. 21

క. నీ తెలివితేటలను సం, గీతాభినయప్రసక్తికిన్ గైతకుఁ బ్రౌ
ఖ్యాతిఁ జెడఁగొట్టెఁగద! లో, కాతీతంబైన లజ్జ యలవడి యబలా. 22

క. అనుమాటకుఁ బ్రత్యుత్తర, మును జెప్పక యంతకన్న మొగ మింపుగ వం
చి నగుచు నా జలజాక్షి య, భినయపుఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. 23

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యె ధీర యగుట, సహజవైఖరిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప, నిందుముఖి కిట్టు లయ్యుదారుఁడు పలుకు. 24

తే. గీ. ఏటికిద్దాని నీవలయించె? దింక, నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె
"పడుచులం జెలలోఁ బతివ్రతలుగాఁగ, నాజనమ్ముల లంజెయు" నాఁగ వినమె. 25

తే. గీ. నీవు చెప్పినయట్లన యీవెలంది, యేదియో కారణమ్మున నిక్కాలమునఁ
బాదమెఁగాఁబోలు వయసునఁ బ్రౌఢ యయ్యె, నింతవినయ మిక్కాలమున నెందుఁ గలదె.

తే. గీ అభినయమ్మది చూచినయట్టులయ్యె, గాన మీరీతి చక్కని కాంతి గలుగు
పలువరుస గలకలుకుల కొలయు టసదె! కవన మీరెంటికన్నను గష్ట మగునె? 27

క. అను నాతనిపలుకులు విని, తనపై నవ్వానిమనము తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీఱని చింత వహించి యిటు కరమునూహించుచున్. 28

ఉ. చక్కనివాఁడు మేటి సరస మ్మగు వర్తన మొప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడునేర్పరి ద్రవ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁ డౌట పురాకృతపుణ్య, మైనన్
జిక్కిన పూర్వపుఁబ్రియుని స్నేహము నేగతి మాన నేర్చెదన్. 29

క. ఇతనిన్ గాంచిన దాదిగ, పతి నీరై యంతు లేనిమరులున కొరయై
సతమైనచింతఁబడి వి, స్మృతసకలం బయ్యె ముందు మేఁగుట యెట్లో. 30

చ. ఇతని వరించి యెల్లపు డహీనసుఖమ్ముల నందుచున్ రహో
స్థితి కధికార మూనినమనమ్మునఁ దన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ విసివి మాటికి దూఱియుఁ ద్రోవఁగాన క
చ్చతురుఁడు కాయమున్ విడి యశమ్మెటువంటిది నాకుఁ గూర్చునో. 31

మ. ఎపుడో యే మగనో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిపుడే తా మొగమింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ ధీరత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడఁగఁ దన్ గన్పట్టుచున్నాఁడహా. 32

సీ. ఏకర్మమెఱుఁగని యెలప్రాయమున నేను కసరికొట్టి నొకింత పసువఁడయ్యె
నెతెఁగియు నెఱుఁగని చిఱుతగుబ్బలసాఁటి పరుసదనానను వెఱువఁడయ్యె
నట్టికేలను వాదుగుట్టు చేకొని వృథ యాడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గు కలహమ్ములను భీతి గాంచఁడయ్యె

గీ. వన్నెటికినోర్చి ననుఁబ్రియురాలొ లేక. దైవమో యనుబుద్ధి నెదం దలంచు
చున్నవాని వృథా దర్వ్యమన్న కార, ణమున విడనాడు నాకు జన్మమునుగలదె

గీ. దౌత్యమంగీకరించె నాతనిఁ గరంచె, నంతఁ బోకి మ్యాడమును దెచ్చెఁ జింతగలిగి
యును మదుపకారమునను దానినెడఁ జేసి, యీనుదిగమిఁంగ నింతవిశ్వాసిగలఁడె!

చ. ఇటువయి నీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి యు
త్కృటికము చూపి నేను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెవన్ మఱమఁగాక యిడెల్లను గామియౌట, నా
కెటు మఱవంగవచ్చు నిది యెన్నిభవమ్ములకైనఁ జాలదే. 85

చ. "తనపిరియఁ దైనవాఁడఁ టొకతప్పను నాతనియందు లేదఁ పే
పనియును నొనర్చువాఁడఁటు! సెబాసు! ధనమ్మునకాస చెంది యా
య్యాఘుని నీచకృత్యమున కాప్పఁగా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశము వాయుఁగ నాకు నుపాయమున్నదే. 86

తే. గీ "పెండిలివి వాడకుండిన నుండెఁగాని, వారకామినియైనను వను నొకానొ
కని వరించి తదనుగతిగా మెలంగవలయు" ననుకట్టుఁబాటుండవలదె! జగతి.

ఉ. మాలెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునను జరుచు నొక్కకనిన్ వరించుచున్
గాలముపుచ్చుచుండ, గణికాజనమంతయు నెంతహీనమో
శూలతనమ్మునన్ బసుచుకొంటను రోయ వొకించుకేనియున్. 38

తే గీ. ఒకఁడువోయినమీఁద వేఱొకనిఁ గట్టి, కొంటమాచార మొకకొన్ని కాలములం
దు నందులోనను జేర దీయుధనములను, ధాత వంచించె నీజాతి తలియఁబోండ్ల.

క అనితవమనమునఁ జింతిలు, వనితామణి సారెసారె, వార లిరువురన్
దనతన కనుగుణ మగు రీ, తిఁ జింతం గాంతు రదియుఁ దెలుపఁగ నేమీ! 40

గీ. ముగుద నీగతినొందెడొయి మొగము గనుచు, నెడ తెఁగని చింతయను సంద్రి మీఁదుచుండఁ
దరణి యంతటి వారికిఁ దగని యటుల, హా! యనఁగఁ బశ్చిమాంబుధి డాయఁజనియె.

క. అంత నుదారుం డచ్చెలి, చెంత న్నిలుపోపలేక చేతోజాత
శ్రాంతికి వశుఁడై చనియెడి, చింతన్ లేమటయు నతని చెలి కాఁ డనియెన్. 42

ఉ. గానమువింటిమో కవనకౌశలముల్ గిలకించినారమో
మానమునందుఁ గల్గు ననమాన ప్రజాతురి దక్కఁ బంకజా
తాసన యించుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ సలిలాక్షిపై నలిగి యిక్కరణిన్ జను టెట్టు లొప్పగున్. 43

ఉ. నావుడు నాతఁ డిట్టులను "నాదు మనమ్మునఁ గోప మంచు నీ
వేవగ నిశ్చయించి? తని యెక్కడి చాతురి? యింతమాత్రనే
యావగలాఁడి నమ్మెనె? సఖా! యొక విద్దియుఁ గాదు దీని కే
త్రోవల నేలతాంగి సవతుం గనఁజాలు! సెబాసు! వహ్వారే! 44

క. కనుఁగొనినమాత్రనే మన, మున మోదం బుప్పతిల్లె ముమ్మాటికి ని
క్కాఁ గాంగి కింకర్త్రమమి, చ్చిన దానం జేసి మనసుఁ జేటుగుఁజూమీ. 45

చ. ఇది మొదలిత్తలోదరికి నెవ్వరియొద్దను పెద్ద చూపునీ
చదలఁ దొలంగఁజేయు మనచాపుఁడు యత్నమొనర్చుఁగాక యి
చ్చ్మవతి సిగ్గునం దిటులు మ్రగ్గుమనుంకుటు చూచి యాత్మసం
పద నెఁడింపఁ జేయుచెలిపట్టున నాతఁ డనుగ్రహింపఁడే. 46

తే. గీ. మరలరావచ్చుఁగవవచ్చుఁ దిగ్వయదేల?, యబలయేమగు? మనమేడకరుగువార?
మభినయంబెంరుజొమ్ము? నెందడఁగుగానఁ?, మగునె! యారంభశూరత జగతినెంచు.

క. నావుడు నర్మసఖుం డ, ప్పూవుఁబోఁడిఁగని పల్కెఁ "బోలఁతిరో? నీవైఁ
గావలసినంతకోరిక, చే వచ్చినవారి నిట్లు సేయుం దగునే? 48

క. సుమగాత్రి! వారి మంచితనమున నీన్నలోటు దాఁ గనం బడదయ్యెన్
దమలపుటాకులకున్ నో, చమె? యెఱుఁగవె? యిదియు సాంచంద మ్మగునే?

మ. అన నచ్చేడియ భూమణధ్వనుల పాల్పవ్వారిగా నల్లఁగ్ర
క్కునఁ గెళిభవనమ్ము చెంతఁ జని యాకుల్ పోఁకలున్ దక్కఁగ

ల్గిన మేల్వసులుగూర్చి పళ్లెరమునన్ గీల్కొల్పి యొయ్యారమై
ల్లను రూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన్ వచ్చి యచ్చేరువన్. 50

గీ. వినయభయసంభ్రమమ్ములు పెల్లిగొనఁగ, నిలువఁబడునంత నద్దానినీటు కొంత
యడ్డులేమిని గనలార నతఁడు గాంచి, నిలువునీరయి యట్లన నిలుఁబడియె. 51

తే. గీ. అంతనచ్చెలి మిన్నకరాగ్రకీలి, తమ్ములకు నాగవల్లీదళమ్ము లతని
హస్తమునకంది పళ్ళెర మచట డించి, చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక.

ఉ. అంత సుధారుచుఁ డొక్కఁగతి నచ్చోటు వీడి తదేకచిత్తుఁడై
యింతివిలాసముల్ మగువయెమ్మెలు పైదలి మేల్ పొరంగులున్
గాంతయొయారముల్ గనులఁ గట్టినయట్లైమను న్నటింప న
క్కంతుఁడు లేనిమేళ మటఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. 53

ఆ. వె. చనుచు నర్మసఖునిగని యిట్లనుల్కు "నో, చెలిమికాఁడ! జగతిఁ గలుగుపట్టు
ణముల మాపురమ్మునంగల చోద్యముల్, గానరావు వేఱొకంట నెందు. 54

చ. అటఁ గులకామినుల్ పదపుటంగనలున్ మతివేనవేలు మి
క్కుటమగురూపమున్ పరాతులు గొల్లలుగాఁ గలవారలుండ్రు నా
కెట నిటువంటిచానఁ గను టెన్నఁడునున్ లభియింపదయ్యె ని
చ్చట భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్యమబ్బెఁగా! 55

క. నాతోడ నీవు సెప్పిన, యాతరుణీమణియె యిదిసఖా? యది గాదో?
యాతీరెక్కడ? నీవను, నాతీరెక్కడ? తలంప మంతరముసుమీ. 56

ఉ. చూడక చూచునేర్పు వినుచున్ వినకుండెడికౌశలమ్ము మా
టాడక యాడుజాణతన మన్నిటికేమి? యొకింత లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపొల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలను దీనికిఁ గల్గుచాడ్పునన్. 57

తే. గీ. గుబ్బలబెడంగు పిఱుఁదులగొప్పతనము, మేనితళతళలును మోముమిసమిసలును
గలికికైనంతమాత్రిన గల్గు నిక్క, తమున మెచ్చితి నంచెదఁ దలఁతు వేము.

చ. పలుకులు వేయునేల? పరభామలఁ గన్గను లెత్తిచూడనే
తెల్లవెలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్,

గలఁగదు మానసం; బిచట గానమటుండ మఱొండటుండఁ బ
ల్కులును వినంగలే దకట! కోరికలీరిక లెత్తనేఁటికిన్!

చ. తరము లనెన్ని యోరిజనిగేఁ దాతల తాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కులన్
మరగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాండితీధురం
ధరు లటువంటివారి కిఁక నాకతనన్ దిరిదివస్థితుల్ చెడెన్. 60

తే. గీ ఏమయినఁ దప్పదింక నీయింతి చెలిమి, యయ్యదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మనెంతు, ననుచు నతఁడిట్టులను నువారునికిఁ జేర్చి. 61

ఉ. చెప్పితఁగాదె! మురన్ రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తనంత న
య్యొప్పులదప్ప యొప్పికొను టొక్కటిదక్క నుపాయమింపునన్
జొప్పడ దన్య, మేమయిన సుందరిడెందము చూచిచెప్పెదన్. 62

చ. ధనమున లెక్కలే దొకట దానికి లోఁగిన వేలసఁఖ్య కే
చ్చును, నదియేనిఁ దజ్జననిమాపునకున్ భ్రమగొల్పనేమొ! య
వ్వనజముఖీలలామమును వంచనసేయఁగ నేయుపాయమున్
బనుపడ దైవ యత్నమును మానఁగరా దెపు డెట్టు లుండునో! 63

చ. నినుఁ గనుఁగొన్నమాత్రమున నే వెలచేడల లెక్కయేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పక మాననేర్తు! రై
నను నిటు యత్నమేల యన? నాయనుభూతిఁబట్టి చూడ ని
క్కనశనిభాఁగి యోగిఁగఁ గాయముపుచ్చెదునంచుఁ దోఁచెడిన్. 64

ఉ. కాని సమంజస మ్మనుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందురక్తి వెలఁగల్గు నలంకృతులందు సక్తియున్
మానసరపరిచారములఁ జొప్పడుకబ్బములన్ బ్రసక్తి య
చ్చానకు మెండు, తద్విధము చంచలతం గనఁజేయు నిర్వ్యధన్. 65

గీ. మునిఁగిపోయిననదేమి? యమ్మకుదతల్లి, తోడ మీమది నున్న సంతోస మొప్పఁగఁ
జేసి యామీఁద దానికిఁ జెప్పఁజేసి, [illegible] చెప్పిమాతు నిందేటిచింత! 66

శా. నాపుడు నత్తన్విమ్మ మెదవాటు నుదాయఁడు పల్కు "నెప్పుడో
నీ విటు సేతు" వన్న నెటు నే నిలుపోపుదు? నేఁటిరేయి నా
శావగలాఁడి, యాయతివ, యాచెలి, యాచిగురాకుఁబోఁడి, యా
కావరపుం జనుంగవ బోటుపుటికల్ల, వశమ్ము గావలెన్. 67

క. రేపేమో మనమేమో, యాపూవు బోఁణియేమొ యన్యమదేమో
నే పామ్మిప్పుడ నాసం,తాప మ్మెడఁబాపు మింకఁ దడయుకు మింపటన్. 68

తే. గీ. చందురుం డర్ధముదయించెఁ జదల వెన్నె
లయును బర్వెఁగఁ జొచ్చెఁ దొలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందముల ప
రిమళమ్మును వెదజలెఁ దేఁగ మరుఁడు. 69

ఉ. తల్లికి నేమి చెప్పెదవొ? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి కేక్రియఁ గృపన్ గలిగించెదొ? నన్నుఁ దన్మనో
వల్లభుఁ జేయు భారమది పైనిడికొమ్మిటు నీ వొనర్చినన్
జెల్లు నటం చెఱుంగు మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. 70

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటు మాడుగుల్
గలవు సమస్తముం గలదు గాని యొకించుక లేనివారిలో
పల నొకరుండ నియ్యబలఁ బాణిగృహీతఁగఁ జేయనేనిఁ, గో
ర్కుల కెనగాని సంపదలు కుంకుమ లేని కులాంగనామణుల్. 71

ఉ. ఏ నని తా నటంచు నొకయించుక భేదము లేక యుంట న
చ్చానకుఁ జెప్పగాఁ దగఁ గంగతు లేమని బోధసేతు నీ
కే నెఱిఁగింపఁ గావలయునే? యదిగాక, పురాకృతంపుఁబు
ణ్యాంగద! లభించితివి నాకొక దూతగ నీవు నెచ్చెలీ. 72

చ. అన "నిదె పోయి వత్తు" నని యాతఁడు వెన్కకు నేగ, మీఁద మి
ల్లన బసకేగి మిక్కిలి యలందురు నెమ్మదితోడ భోజనం
బొనరిచి మిత్రురాఁకకయి యొక్కెడ నొక్కఁడు గూరుచుండి తాఁ
గనఁగొనుచున్ ద్రుటిన్ యుగముగా గణియించుచు మారు డాఁటుమన్. 73

ఉ. చెప్పఁగ రానివేదనలచే నలచేడియ నాత్మనెంచి "నీ
గొప్పపిఱుందులున్ వలపుగొల్పెడి మేల్పలుచాలు లక్ష్యముల్

దప్పని చూపుఁగోపులును దామరతంపర లైనలీలలన్
ముప్పిరిగొన్న మోహమున ముంచెఁగదే! జగదేకసుందరీ. 74

ఉ. చందురుబాధకే సయిపఁజాలుదునో, మదనాగ్ని కాఁకకే
కందకయుందునో, ప్రియకాలునిజో దలచల్లగాలికే
వందురకుందునో సకలవాంఛలకున్ గురువైనమస్కృత
శ్ఛందనవల్లి! నీదయిన సంస్మరణాశయె మానుకొందునో! 75

మ. అకటా! నే నెటుతాళువాఁడ, నట నీవాఁకంబవుం జాటునన్
వికచాబ్జమ్ముల రెండుగెలంకులను నావిర్భావమున్ జెంద మి
న్నక వీక్షించుచు లజ్జ గొజ్జ వయి యానదింపఁగాఁ జేయు నా
ప్రకృతిన్ లోనఁ దలంచినంత మది నీరంబౌఁ గరంగెత్తుణా. 76

క. అని తన్మయుమగు మనమున, ఘనతర మగు రాగమెదిగి కాలూన నతం
డనిమేషత్వముఁ గైకొని, యును సురతావాప్తిఁ కొఱకు నూహించు నహో. 77

తే. గీ. అట్టు లొకకొంతసేపు మిన్నరసి యచట
గలికి గోరులసొంపు నచ్చెలియుమోము
పెంపు నొకకొంత గని యంతఁ బెదవిఁ దెవి
నర్మసఖు నాత్మ నెంచి తన్నాయకుండు. 78

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనఁదేఁ డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యెట్టియుత్తరము నన్నొందూర్చి తానంపెనో?
యదనున్ వమ్మొనరింప నెంచదుకదా? హా! దైవమా! యిట్టి క
ష్టదశాపాకము మిత్రుఁ డొప్పికొనునే? చాతుర్యమున్ జూపఁడే? 79

ఉ. ఎక్కడిమిత్రుఁ! డే నచటి కేతని నంపుట గొప్పతప్పు "తా
నక్కడ కాంగి కేతఁడు ప్రియంపతువాఁ" డని వింటిగాదె? ఛీ!
మక్కర యెంతచేసె? ననుమాన మొకించుకయేనిఁ గాంచ కా
డిక్కున కట్టివాని వెనుదీయక పంపితి నెంత వెఱ్ఱినో? 80

తే. గీ. "తెలివితేటలుగలవాఁడు ధీయుఁడితఁడు, చనిచోఁ గార్యసిద్ధియౌ" నని తలంపఁ
గూలిపాలి సామెతయొనగూడ దాని, నొగి నధమసాయకుఁ జేయుచుండె నేమొ?

ఉ. "కంటివె నా(డొకింత కొనగోటను నైనను మీరు కొందు నా
గ్గంటిని నాయకున్ గలుప(గా గమకింప(" డటంచు మున్ను నే
వింటిని వేయుసార్లు, విధి, వీ(డిక నచ్చెలిమిన్న తోడ నా
యంటును సొంటు నెం దెలుప నాడుచు(బాడుచు(గూడుచుండె(బో! 82

గీ. తనరుచి త్తమ్మునేనియుం దగినసొగసు, గలుగు చెలిమిన్న కడకంప గదలి రాదు
అట్టిచో(గేవలాన్యుల నంపనగునె? దౌత్యమున కన్న సతి పొందు తప్పిదంబె? 83

క. పురుషు(డు పురుషునినంపుట, తరుణి తరుణినంపుటయును దగ దొండొరు లొం
డొరుల ననుప(దగు దౌత్యము, విరచించెడిపట్ల(గడు వివేకము మెఱయున్ 84

మ. అని మిత్రుం గడు దూఱుచున్ మనమునం దాలోచనల్ సేయుచున్
వనితన్ లో(దలపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్
దనకై తానటు కేగ నూహగొనుచున్ దర్కించుచున్ దాపమున్
గనుచున్ గుందుచు నుండెనంత హితు(డున్ గన్పట్టె దౌదవ్వులన్. 85

క. కని "యత(డగునో కా(డో", యనియును "కార్యమ్ము సఫలమయ్యెనొ లేదో"
యనియును "నిష్కారణ మివ్వ్యసనపాత్రుని దూషినా(డ" నని యును నగచున్. 86

తే. గీ. అంత దగ్గఱ కేతెంచి "యనఘ! నీకు, పనుపునన్ జని యాళితపత్రినేత్రి(
గాంచి మెలమెల్ల నీప్రసంగము నడించి, తెలిసికొంటిని మదినున్న తెఱగు కొంత. 87

క. అంగీకృతి సూచింపద, నంగీకృతి తెలుప దెందు నతివలు లేరే?
రంగైన మిన్నువంటి భు, జంగుల పిలుపంది యిట్టి వందము కలదే? 88

చ. అయినను నాలతాంగి వ్రాసియుం బొకకొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెయ్యుల నెఱింగితి నంతట దనంత నెమ్మి(ద
ద్దయు(గతిసాత్మ యామ్యతివతల్లియు నయ్యెడ కేలు దించె నా
శయ మొకకొంత దెల్ప నది సమ్మతి గన్పడ(జేసి యిట్లనెన్. 89

ఉ. ఏయెడనైన "నియ్యతివ యెవ్వనిసాని?" యటన్నవో "ఫలా
నా" యని చెప్పికో(దగిన నాయకు(డబ్బిన మాకు(గీర్తియౌ
"నీయనసాని యెవ్వతయొ యెట్టిదియో!" యని నప్పుడో "ఫలా
నా" యని చెప్పికో(దగిన నాయిక గల్గిన మీకు(గీర్తియౌ. 90

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన, మనుచు వర్తింతు నేకాని ధనము దొంత
వచ్చినను వేఱురీతుల కిచ్చ సేయ, నెఱుగరే? మీరు నావనోవృత్తి రీతి. 91

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడునన్ వదాన్యుఁడున్
జనవయ సొప్పువాఁడు నెటుచేయుటుఁ? బాల్యుఁడుఁ డిట్టికేలనున్
దనకు లభించె మీకృపకతమ్మున, నియ్యెడఁ దక్కఁజెల్లునే!
యనవగువాని మానఁదగునా? మనకెల్లపు డిట్టిఁ డబ్బునే? 92

ఉ. కావున మీరుచెప్పినసికప్రియమున్ గని శంకఁదక్కనే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "నామతనూజపైఁ గడున్
భావము మీకుఁ గల్గు టది భాగ్యము కాని సదా కళత్రసం
భావన దీనిఁజూడఁదగుఁ బ్రాయము శాశ్వత మౌనె? యోరికిన్. 93

క. విషవవలసివచ్చిన లో, గడ నిచ్చిన దట్టులుండఁగా దానికి ము
మ్మడుగధికమిచ్చుటయు ని, ష్పాప పత్రము వ్రాసికొనుఁడు పూవుంబోఁడిన్. 94

క. "మోమోటమింతుకయును లే, కీమసలినె యిట్టులనియెనే?" యనకుఁ డహో!
కాముకు లెక్కడ? సత్యము, లేమాడ్కిని?" నాకుఁ గ్రొత్తలే! యివియెల్లన్. 95

తే. గీ. మొదల నేర్పాటొకం డిట్టులొదవెనేని, మేమె మీరయి మీరలే మేముగుచు
నుండఁగావచ్చుఁ గూడనే?! తొండిపట్లు, వటి యువ్యవహారపుం బట్టు మాటకునుం 96

గీ. అందటింబోలెఁ జలువుర నాశ్రయించి, యొకరికనుఁబ్రామి యొకరితో వికవికలకుఁ
బోవుటలు వాగ్వహమ్మునపూవుఁబోఁడ్లు, సేర రిదిమీకుఁ బదపడి నిక్కమగును. 97

చ. వలపు గలన్ని వాళ్లు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడుఁజేరకచేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొండొక తగ్గనేని య
క్కలికి మొగమ్ముమాడ రిది కాముకధర్మము నేనెఱుంగుదున్. 98

చ. కలసినకొన్నినాళ్లొకటిగాఁ గనుపట్టెడి మేను లై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు వాలునై
వలపు క్రిమమ్ముగా నుడుగుపట్టున సానియవస్థ చూడఁగా
వలయుమఱొక్కఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ? కామితార్థముల్. 99.

చ. వదలినఁ జచ్చిపోము మనవైఖరి యిప్పరయుంచు నెందుఁ దా
మొదలఁ గనంబడున్ బిదప మోహముతగ్గియు జ్ఞానమబ్బినో
మదవతికన్నఁ బూరుషుమానస మొండొక చుట్టుఁబోఁడు న
ద్యది గనిపెట్టలేని వెఁయాంధ్రము నేఁగతి యుప్పునెగ్గడిన్?

చ. తగినవిటుండు చేకుఱఁడు తారసమైన ధనమ్ము నీఁడు సో
యగమును నీగిచూడఁగలుగు నట్టిఁడయేని యతండు నిర్ధనుం
డగు మన మిచ్చువారు కఱవా? ధనమిచ్చెడి వారెకాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మాగణికాకులమ్మునన్. 101

గీ. "సానులను జేయుటుడిగి లోకానుగతిని, బెండ్లియొనర్చుకొనరాదె? వెలవెలందు"
లంచుఁ గొందఱుబోధింతు రదియునంత, మంచిత్రోవయటంచు నామదికిరాదు. 102

శా. త్రాగుంబోతులు జూదగాండ్రు వనితాగ్రహార్తిపరుల్ సోమరుల్
భోగంపుంగొలమందుఁ బుట్టుపురుషుల్, పూఁబోఁడ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కలార్థ్వ లెటు లీయోషామణుల్ నీచులన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె? మర్యాదయున్. 103

ఉ. సానిగఁ జేసెనేనియును శాస్త్రిలుఁ బంతులు మంత్రిలున్ ధరే
శానులు వైశ్యరత్నములు సంపద గల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకులచందమునం దనయిల్లు గాతు రిం
కేటివాక్షితిం గలదె? యిట్టిమహోన్నత భోగభాగ్యముల్. 104

సీ "ఏకలెక్టరును లేదింత వ" ర్కనుభంగి నుత్తరమ్ములును బ్రత్యుత్తరములు
"ఏడాక్టరును లేదింత యల్లడి" యన్న చందాన నిలుగాచు సారటులును
"ఏజనానాను లే దీచంద" మనుభంగి నూపిగం బొనరించుచేడియలును
"ఏదేవతయును లే వీకాన్క" లనుతేవ ఫలపుష్పముఖనస్తుపటలములును

తే గీ తనకొలమ్మునఁబొడమిన మనుజు నొకనిఁ, గట్టికొని కాఁపురము సేయు సానికిట్లు
గలుగ నేర్చున? సానిగా దలచి వలపుఁగలుగఁజేసెడి కలికిమిన్నలకు దక్క.

తే. గీ జగతి "వాణిజ్యకృషికర్మ జనవరేణ్య, సేవనమ్ముల సంపదల్ చేరు" నని
చెప్పుదురుగాని తగినట్టియొప్పుగలుగు, సానిగడనకు నవి శతాంశములు గావు

తే. గీ నీచ మిది యంచుఁ గొందఱు నీతివిదులు, పలుకుదురు సత్యమే యట్లుపల్కువారు
పలుపువృత్తుల నిట్టినైచ్యం బొకింత, లేదె? యొక రొండొకరి నెంచలేకపోరు.

శా. ఉద్యోగం బని ప్లీడరీ యనియు నెంతో మంది శ్లాఘింతు రా
యుద్యోగంబు శ్వవృత్తి యండ్రదె తా నొక్కొక్కడన్ మాపనిన్
"హృద్యంబౌ" ననిపించు లాభమది యొందేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య మెల్లగడు, నీచానీచతల్ చూచిరే? 108

క. ఏకార్యంబు రయము లోకస్థే కడపాటును స్వవృత్తి నే తద్వ్యక్తిన్
దాఁకు నసత్యమ్మిది నే, న్యాకాముకు లైనరసికు లారయుదు మదిన్. 109

క. ఏవృత్తిఁ దలఁచి చూచిన, నావృత్తిఁ దగినకష్టముండుండెను నే
న్యావృత్తికి సెజ్జపయిన్, గావలసినయంతపసిఁడి గలిగెడిఁగాదే? 110

తే. గీ. అయిన నే నిట్టిమేలైనయట్టి వృత్తి, కిప్పు డెన్నెన్నియో సంఘటించె ముప్ప
లక్కతమ్మునఁ దగినంత యట్టికట్టు, దిట్టుఁబలు చేసినన్ గాని దీఱదింక. 111

గీ. అనుచు నేమేమియో చెప్పిన మదారుఁ, డాననము వికసింప "నోయనఘ! వృద్ధ
గోరు టది తప్పుగా దిది క్రొత్త యగునె? యెవరుగోరరు? కూఁతుల నిచ్చుపట్ల.

క. వారలు గోరిన నది యొక, తీరుగఁ గనుపట్టుఁ దగమతిన్ దలపోయన్
ధీరులకు నదియు నితరము, నారూఢిఁ నొక్క విధమయగుఁ దుద కెన్నన్.

ఉ. ఇంతకు నేఁటిరేయి నను నేణవిలోచనతోడఁ గూర్పఁ దా
యింతి యనుగ్రహించెనొ? మహాత్మ్యదియే నిదిగాక యత్తు నో
క్కింత వచించెనో? నొడువు మిప్పుడు కెన్నఁడు నెన్నఁడేయు నే
యింతికి నేనిఁ దప్పు దిది యేటికి నాకడఁ జెప్పఁగావలెన్. 114

క. అనవుడు నతఁడిట్లను నే, నును నిట్లు చెప్పి తన్మనోగతిఁ గలవ
ర్తన నెఱిఁగితి నంగీకృతి, కనుపట్టెన్ జనుటె తడవుగా? మన మింకన్. 115

ఆ. వె. అనుచు నయ్యుదారు నచ్చెలి యిర్వు కేళీగృహమ్మునకుఁ జెలిమిదలిర్ప
వెంటఁ బెట్టుకొనుచు వే దీసికొనిచనె, నర్మసఖుఁడు కామధర్మవేది. 116

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందు

ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## చతుర్థాశ్వాసము



ఆ గ్రభశ్రీగుంఫిత
జోగాంబా రామయార్య సుచిరకృత తపో
యోగపరిణామ లలిత
శ్రీః ంఘర్యాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బత్తలోదరీమణి సువాసుఁ గల్వ యాశాముకుండు
చిన్నవోయినమోముతోఁ జెలియ యునను నందుఁ దలఁచుచుఁ దనయింటికరిగి పిదప.

మ. అకటా! పిన్నటనాఁటనుండియును నాయానంద మానందమై
వికలత్వమ్మును బాధ్యశంబయి దయావిర్భూతిమై నెందు భి
న్నకృతుల్ నేరకయున్న నెచ్చెలికి నన్యాస్యంబు నేఁ డబ్బినన్
వెకలిన్ జేసెఁగదా! వృథా వెలచెలిన్ ప్రేమించి కామించితిన్. 3

ఉ. నావలనన్ గ్రహించె లలనామణి బాహ్యరతాదిసర్వసం
భావన లక్కటా! యిది నిజా! యని యన్యుఁడు మెచ్చనయ్యె; గో
దావరి పుట్టు టొక్కయెడ దానిప్రయోజన మింక నొక్కచో
నీఁది గొత్రయే? యెఱిఁగి యిప్పెడ నేఁ దపియింప నొప్పునే? 4

శా. నాకన్నన్ గడు లేఁతప్రాయమును విజ్ఞానమ్మునన్ దేజమున్
శ్రీరూపాలంకృత భోగభాగ్యములు నాసిన్ బోల్చ నవ్వానితో
నేకీభావము నంది యిప్యబల నన్నేమంచుఁ గామించు? నే
నీకాంతామణికింక నిర్వహించుచో యెబ్బంగి యుక్తమ్మగున్. 5

చ. అవమరలేక చిన్నతనమాదిగ నొక్కటిమై పరస్పర
స్మరణముదక్క వేఱొకవిచారము దూరముఁజేసి విప్రలం
భరసము వెళ్లఁబుచ్చుచుఁ బ్రపంచమెఱుంగని యట్టియుగ్మమున్
విరహముపాలు సేయు నవివేకికి ధాతకు జన్మమున్నదే? 6

ఉ. సానులు లేరె! యీజగతి, జాణలు గారె? మనమ్ము నీరె? యే
సానికి నేబొఱుంగునదు సఖ్యము లీగతి గల్గెఁ? గల్గుఁ బో!
యీనియతిన్ మఱొక్కనికి నింతిని దానయి కూర్చి పొమ్మన్నో?
మానము దక్క దెందు వెలమానిని నమ్మఁ? యెమ్మెకాండ్రకున్. 7

సీ. కలికి యింతకు వానికెలన నల్లనిల్చి యొయ్యారముగ వీడె మియ్యకున్నె?
యబల యింతకు వాని యక్కునఁ జక్కఁగఁ జేరి ముద్దుముద్దులు మించ మురియకున్నె!
పొలఁతి యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కుఁగొట్టి పెట్టిన ముద్దు వెట్టకున్నె?
గరిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి గరువంపువిభవంబు గాంచకున్నె?

తే. గీ. అలలన లేనిపోనిదైనట్టి యలుక, గాంచి యింతకు నాయెమ్మెకానిచేత
ననునయమ్ములవెన్నియో గొనకయున్నె?, చెనటిదైవమ్ము నన్ను వంచించె నకట!

మ. పలికెంబో! చెలి నన్నుఁగూర్చి "యొరునిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వెలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
ష్కలుషంబౌ మదినూని వాని పతిగన్ గల్పంగ నా కొప్పునే?
తెలియంజాలక మోసపోతి నిటు నీతిన్ బూనఁగాఁ జెల్లునే? 9

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము కూడినవా రసత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాము నెడన్ బుజువర్తనమ్ములా?
సలుపుట, దేవుఁబట్టి సదృశంబగు పత్త్రిఁ గూర్చు టొప్పవా!
వలపున ముంచి మించి పటు వాతులు గోతు లొనర్తు రక్కటా! 10

తే. గీ. అనియెఁబో! లంజెయాటఁ దాఁకట్టిమాట, నామయోగ్యతయెయ్యెడఁబూదిఁగలిసె
నేము నేట్రికి? వెలయాఁడ్రు డాయువారి, కంతకన్నను దుర్వృత్తు లబ్బు నిజము. 11

ఉ. దానునిరీతి దానిపదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసికదా! మదీశ్వరుని జేయనిదుష్కృతి నెప్పుకల్పి న
న్నాసతి చేయఁజేసె నకటా! యిటు లెప్పుడు చెప్పె నప్పుడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలిశాలుక యింతయింతగన్. 12

తే. గీ. నన్నుఁ బిన్నాఁటనుండియు నమ్మఁజేసి తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి సుఖముమనున్న యక్కలికిమిన్న, కేల తగుఁదు? నాయుసు రిహామునందె. 13

ఉ. ఇంత యపాత్రురాలగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి నుత్తలపాటు జెందెడిన్
గాంత దలంచి, యార్య! "పితృకాండ్రకు నెక్కడిమాన?" మంచు సి
ద్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? 14

ఆ. వె. నిక్కళక్షణులైన నీట్రి కాండ్రకు మనం, బీయ కిచ్చినట్టులే నటించు
రకట! వారకాంత లద్దమ్ములో మోమ, దెట్టులుండు? నిదియు నట్టులుండు.

తే. గీ. మచ్చిబంగారమున కాదిమూర్తియైన, వెలవెలంగుల పేర్మిలోనల కూర్చి
యట్టివిటులను ద్రవ్యతుల్యు బటుండ, బలువు గుణము నవ్వ టిమ్యాది పైనికోసరు  16

తే. గీ. తనువునందలి సారమంతయును నయముగను, నల్లనల్లన లాగి వారాంగనాజ
నంబు తమవిటులను కుసుంబ భుజంగు, లను వెడలంద్రోతు రిదిగనం గొనరు విటులు.

చ. కొలముగం బుట్టి ట్టియొక కోమలిం బెండ్లిటువాండ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాం దలిదండ్రులు నత్తమామలున్
బలువురు దన్ను మెచ్చం గులపావనుం డన్నయశమ్ము లోకమం
దలమం జరించువాండవిక నా? నిజమైన సుఖమ్ము లెమ్మొకాన్.  18

క. అని యాతండు పలువిధముల, మనమునం దలపోయుచుండె మానినియును మదా
రునిం గలసి మెలుగుచును నో, య్యన నాలో నితనిం దలంచి యాత్మగతమునన్.  19

మ. అకటా! నన్నెడంబాసి యెన్నండెటులం దవ్యాజరాగార్తి యుం
డోకరిం బోలెడివాండు గాండ దక్షుండు నన్నుల్లమ్మునం దెంచి యే
మికతల్ సేయంగ సాహసించెదిరో? నామేలెల్ల దమ్మునెమ్మె న
మ్మిక నాపై నికనైనం జెరదె? యేమో? నాని తప్పెట్లుగన్!  20

ఉ. వేసకకాండ డుటుంచు మది నెక్కసమించుక లేక "యిుడోయిం
గూడంగం దెమ్ము" టంచు నంగూడు నె? విత్తము కారణమ్ము గాం
జూడనిమోడ్కిగా మతి బాజాంగులం గూడినం గొంతం గూడుంగా
కేవని యిట్టివర్తనము? లేమనిచేసితి? నేను మెత్తురో?  21

క. నాకారణమునం గులమున, కే కానికళంకగతి నిహిహీ! యిటులై
నాకత నిన్నును నోరుక, యే కాముకు నిచ్చగింతు! రిల విలచెలులన్.  22

ఉ. ఎంతటి మానహీనులో! మరెంతటి యేవము లేని పందలో!
యెంతటి బుద్ధిశూన్యులో? మరెట్టివారో? విటు లాంద్రు, భోగపుం
గాంత లొనర్చు హానులను కన్నులనిండంగ నెప్డు చూచుచున్
బంత మొకింత పూన రిది వాలిశవృత్తిగం జూడ రక్కటా!  23

శా. తా(ుగుంబోతుల బుద్ధిహీనత గదా! దర్ఫ్యమ్ము సారాయికిన్
రాంగా హేతు, వదెంత కట్టుచెడినన్ రారంగురే? నా రహో!
భోగంపుంగొల, మట్లనే విటులనుర్భోగాప్తి దుశ్శీలమై
భీగం బూడ్చినపెట్టెయై యిటు చెడెన్ బెంపేది నానాంటికిన్.  24

క. ఇక్కరణి నన్యయోషం, జిక్కియు నన్యానిమనము చెయ్యాలఁ దనరుం
దక్కించికొనియె విటులకుఁ, దక్కనసంగతులపైని దలపు గలదే? 25

ఉ. పువ్వులవిల్తు పోరఁ గలపోకుము లెల్లను నొక్కరాత్రికే
యవ్విటుఁ డవ్వెలందియును నాని సుఖించి, రవిట్టి వట్టి వం
చెవ్వరిఁ దెల్పనొప్పును? నదేమిటికి? కింత కెఱుంగనట్టి వా
రెవ్వరు? పక్షులున్ బశువు లీసుఖ మందవె? యంతకెక్కుడే? 26

ఆ. వె. ముక్కుటమ్ములంత గొమ్ముడుకోయనె, నలముఁ దోఁచెఁ జల్లనైనగాలి
చుక్కవోడిచెఁ దుక్కరిక్కలు తటిగె, నజ్ఞాని వెల్లవాసె జాబిరేయి. 27

ఉ. అంత నుదారుఁ డచ్చెలి యొసారముగాఁ దను సాగనంప న
య్యంతవిలాసముల్ హృదయమెల్లెడ వేళ్లు ఘటింప సంకటన్
ధ్వాంతమడంగియున్ దనరియుదం గలధ్వాంత మనంతమై తగన్
జింతమలోడు లేక యలచేడియు నెంచుచు నింటికిం జనెన్. 28

తే. గీ. సారసమ్ములు వికసింపఁ జక్రవాక, జంపతుల కింపు జనియింప జగములెల్ల
నంధతను బాసి మోదింప నాయిబెంప, రవి యుదయమందెఁ గుముదినీ వ్యథలు డిందె.

చ. అటు లొక కొంత కాల మలయబ్జముఖీమణి పొందు నందుచున్
విటకులశేఖరుం డయి వివేక మొకించుక లేక స్వీయమా
తటకము మాటయే తలఁపఁగానక యుండెను నంత దల్లి యు
ప్పటి చరితమ్ము కింత విని పంపెఁ దవానయనాగ్ర మాపుటన్. 30

ఉ. పంపిననట్టులో చెలికిఁ బాయఁగలేక వసఁబాసి "యుత్తగం
బంపుచునుండుమీ?" యనుచు నాదర ముట్టిపడంగఁ బల్కి, నై
లింపనివాసముం దొరఁగలేక యలందుదు నష్టపుణ్యకా
గృహ్యంపుటవస్థ మొల్లఁ దనదై చనె నీగతిఁ జింతనొందుచున్. 31

శా. "అయ్యజ్ఞానసఁ గన్నకన్నలని భార్యన్ జూడ నేతెంచుటల్
నాయజ్ఞానమె రాజఁగన్నకనులన్ నాథున్ విలోకించినన్
హేయమపరిక్రియఁ దోఁపకున్నె? యదిగా కీలోకమం దెన్న నే
స్వీయాదర్శము వారకామినులవాసిం జెందఁగా నేర్చునో? 32

మ. అనుగున్ వెన్కకు లాగివేయుటకు నయ్యజ్ఞాత్మి సాంగత్యమే
కద సామగ్ర్యముఁ జెందియున్నపుడు వెన్కన్ దోడు నీవేల? యో

గాదు గా? యీనుడి గాలిఁ గూడినఁ జిక్కుల్ వెట్టుటల్ మాని మం
దముగన్ బోఁగగనిమ్ము నావనని నీ వాలింపు మిప్పట్టునన్. 33

ఉ. ఈవును గాలియుం గలసి "యేణదృశన్ విడనాడి యేగు టొ
ప్పే? వల" దంచు నన్నిపుడు వెన్కకుఁ ద్రిప్పఁ దలంచినా రహో!
దైవబలమ్ము చాల దది తల్లిఁ దా నవతార మంది న
న్నీవిధి లాగుచున్న దిపు డేమియుసేయకు మాతపత్రిమా. 34

మ. జడ మీ వయ్యు జగమ్ము లెన్క తన నుచ్ఛ్వాసమ్మునం బోల్చు న
ట్టిఁడు నీవున్ సమారారి యౌట నను బోట్రిం జేర్ప నుంకించి నా
యమునన్ వెన్కనుఱెత్తె దీ, వోయలతాపాత్రిన్ వారింపన్ గదా!
పుడమిన్ బుట్టితి వాతపత్రిక! నినుం బోలన్ దలన్ దాల్పఁగన్. 35

వ. పదపడి ధూమశకటంబు నారోహించి యిట్లనుడు.

ఉ. తల్లిని దుష్టురాలను చెడన్ దలపోయుముఁ దండ్రి సౌమ్యతా
భ్యుల్లసనంబు నూరక యహో! యని మెచ్చుచు సారెసారె శ
ప్పల్లవపాణిచెయ్యూల జపం బొనరించుచు నేగె నున్న వా
రెల్లరు నంతరాయ మగు టెంతయు తత్రిలు నోడెఁ గాంత్రిసన్. 36

క. రై లేదేఁ గారణమున, జాల మొక్కవరించి వెనుకజరగినచో నా
వ్యాళోలుఁ దదియుఁ "దనకన, కూలించెడి బాలి" యనుచుఁ గొండొక నెంచున్ 37

ఉ. చిక్కనమేనితో వగపుచెందెడి డెందముతో స్వతఃప్రభన్
దక్కనమోముతోఁ దనదు నాప్రనమున్ జనుపుత్రుఁ దల్లి చా
మిక్కిలి గారవించి మునుమించిన దెంచక, పై నౌకప్రు వెం
పెక్కఁగ పక్క నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. 38

చ. మును పెటులైననున్ గృహము మోపిక నీకిఁకఁ గాలిసంకె లౌ
టను చెలియంగదన్న? కడుఁదక్కరులన్ దరిఁ జేర నీవు వ
న్న? నయముచందమున్ దెలిసి నాయవనున్ యశ మబ్బఁజేయు మ
న్న? నెనరుగల్గు మన్న? ద్రవిణంబు వ్యయింపకు మన్న? వమ్మగన్. 39

ఉ. ఏపని కేడకేనియును నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న? కళత్రి నెంతయుం

దాపము నందుదుష్కృతులఁ దారకుమన్న ? యొకింత పూర్వులన్
దాపసచర్యలన్ దలఁచి తద్గతి నిల్వఁ గదన్న ? మెట్టివై. 40

ఉ. వచ్చెడి రైతులన్ గని జవా బెవరిత్తురు ? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు ? తండ్రినాఁడె తా
నిచ్చినసొమ్ము పుచ్చుకొను టెవ్వరు ? కోరెడివారి కప్పు లి
ప్డిచ్చు టదెవ్వ ? రెక్కడికి నేగిన నక్కడె కాఁపురమ్ములా ? 14

తే. గీ. ఎన్ని జన్మమ్ముల జేసి ? రెన్ని యగ్ని, హోత్రములు తెచ్చి ? రెంతటి కన్న మిడిరి
భూము లెందఱికిచ్చిరి ? పూర్వు, లందు గుర్వ్వయంబింత లేదు దుందుడుకు చనునె ?

తే. గీ. ఎంతదర్గ్యంబు ముందు నీవింటనుండి, తీసికొనిపోతి! వానిఁదఁ దీఁగెకతన
మరలఁబంపినదియెంత? యెఱుఁగు దే? కుమార? యిది మెల్లనెయ్యేవ మణిఁగిపోయె.

ఉ. ఈగతిఁ జెల్లఁజేయు వన మెక్కడిలెక్క? ధరాపురందరుల్
జోగులు గారె? యాన్నృపులఁ జూచుటలేదె? యి దిట్టులుంచు మే
లాగు సహింతురా ? సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
బోగపుఁదొత్తులన్ మరగఁబోయెడినీకత లాలకింపుచున్. 44

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీకు నే
తత్సమయమ్ము నిష్ఠ మియుఁ దార్చుటమాని యయోగ్యతాఖనుల్
కత్సిత లగ్రజాతులకుఁ గూడనిచేష్టలు లంజెముండ లం
దుత్సుకతాధరంబు గొనఁటొప్పునె ? కర్మము కాలిపోవఁగన్. 45

ఉ. వింటిని నీదువైఖరులు పీనుల నూడలు నూడినట్టు లే
యంటును సొంటు లేని కుల మక్కట! గంగను గల్ప నిన్నుఁగై
కొంటిమె ? కొంపె మిప్పులను గూడుక గాడిదరీతి బోగపుం
గుంటలయిండ్లు దూఱుదవె? కూళవె? గోలవె? చేలవే? సుతా! 46

శా. అన్నా! వైఁటబాఁరిందియుఁటు వినికియుం టక్కటా! నీవు నీ
విన్నాణం బెటులబ్బెరా ? ద్విజకులానిర్భాతియుక్తా బానమున్
మున్నెచ్చో విన లేము నీదుకల నే మున్గెన్ మహాపాప, ము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన చీ! చీ! గోత్రవిధ్వంసకా!

చ. నయము భయమ్ము నెమ్మదికి నాఁటఁగ దల్లి యొనర్చుబోధ య
మ్మెయి విని మోము వంచి నయిమిక్కిలి యుత్తరమీక "యెవ్వఁ డ

ప్రయనములోని చెయ్యులను బాయక యిప్పుడే దెల్పె" నంచుఁ ద
ద్దయుఁ దనలోన సిగ్గిలు సుదారుఁడు లో మఱియొండు దోఁపమిన్. 47

తే. గీ. అట్లు వినయంపుఁగనియయి యన్నపానములకు సయితము లేదని మూర్ఖుఁ గాంచి
లోననించుక చింతించి లోలవృత్తియు, యగుచు నాసతి దానిట్లు లనియె మఱియు. 48

చ. ఎఱుఁగక చేయు కార్యముల కేమి? యిఁకేనియు బుద్ధిఁగల్గి యు
ద్ధురితము వాయఁ బొందె గురుదోషనివారిణి గంగ కేగి య
క్కఱ మెయిఁ దండ్రికిం గతులు కల్పనచేసి పురమ్ముఁ జేరు వ
త్సరమును గాకమున్న యిటు సల్పుట యొప్పగు నంచుఁ బల్కెడున్. 49

చ. "ఒకవినసి గ్గడంప నిది యొక్క యుపాయము గల్గె" నంచు నొ
ప్పిదముగఁ దల్లియాజ్ఞ గొని పెద్దలఁ గొందఱి సామి తోడుగా
సదమలబుద్ధులన్ బనుప సాయముగాఁ గొని యాత్రఁ డేగె న
మ్మదనవికారాలయమ్ము పరమపవిత్రితాఘపురాశి గాశికిన్. 50

సీ. అఘగద్దునకు వింతలై స్వాంతమును దన్పు దేవళమ్ముల దీప్తు లావహిల్ల
నిరుపిక్కలను నభోంతరము దాఁటిన మేటి మేడలసౌరు మిర్మిట్లు గొలుప
నెటఁ జూడ నట నే యింత యాచ్ఛాదనంబును లేని లింగాల పోలుపులెసఁగ
వాలుశాస్త్రములు నధ్యయనంబు నొనరించువిద్యార్థులెల్లెడ వేడ్క నింప

తే. గీ. నెన్నియో దేశములనుండి యేగుదెంచి, యట్టి తీర్థికజనము లెప్పట్టునఁ దగ
నూతరిపట్టినగతిఁ బొల్చు సురనది పరి, సరమునం బొప్పుఁ గాశికా పురవరంబు.

తే. గీ. ఎన్నియో ఘట్టములు, నటనెందఱెందఱో మహాత్ములు సన్యాసు, లామహాను
భావులను గొల్చి జ్ఞానమ్ము వడయుగేస్తు, లెల్లయెడ నొప్పునప్పురం బింపునింపు.

శా. గంగాస్నానము నాచరించి పిదపం గాశీశు సేవించి మీఁ
దం గామామరకల్పవృక్షమగు తద్భాగ్యన్ విశాలాక్షి భ
క్తిం గేల్మోడిచి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు పూ
తాంగుల్ వేలకువేలు వొల్తురట నిత్యంబున్ విముక్త్యర్థులై. 53

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు సెప్పఁజాలు? బ్ర
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁ గూడ దాని గౌ
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు నిం
కేదగు దానిసాటి? నతియింపఁగఁ జెల్లదె? కాశికాపురిన్. 54

ఉ. ఆపురిఁ జేరి యాతఁ డటఁ నాదరణీయము లైనకృత్యముల్
వే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిదే
వాపలఁ గొందఱిన్ దనిపి పైగయ కేగి యటన్ బితృప్రియా
తాపవిపూర్తిఁ జేసి యట సాఁగి స్వదేశము బోవుదెంచుచున్. 55

చ. తిరిగియుఁ గాశికేగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రియాగకు నేగి తత్పురి
త్సురసముఁ బట్టి యప్పురిని సొంపగు కోటఁ గట్టి మేటియౌ
బ్బురములు నూచి యేగెఁ దనపొర్లికి నాప్తుఁ తోడ వేడుకన్. 56

తే. గీ. జననికభిషేక మొనరించి సతియుఁ దాను, నమ్మహాగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి, తల్లి సంతసమందను దారుఁ డంత. 57

శా. సంసారస్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్ దగన్ జూచు చా
క సాపాత్రిముగాఁ బ్రివర్తనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్ జేయక తల్లి యాతనియెడన్ మర్యాద నీక్షించి "ప్రి
ధ్వ సప్రక్రియ తగ్గ" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్. 58

ఉ. "అచ్చెలిఁజూచుటెట్టు? లిఁక నయ్యెడ కేగుచుపాయ మెద్ది యే
యొచ్చెము చేసినన్ జనని యొప్పెడి!" నంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకు నాత్మపురమ్మును వీడి మున్నె తా
వచ్చుటఁ జేసి కమ్మఁ దగ వ్రాసి తనంతన యంపె దూతికన్. 59

ఉ. వచ్చిన దూతిచేతి "కిదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁబోఁప నంతలో
హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగెఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ నుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్. 60

ఉ. "ఉత్తరమైనవ్రాయు విది యుక్తమె? నీ" కని యింతి పల్కఁ, బో
"నుత్తరమేమి చెప్పుదు నహో! మది నెంతటి పేర్మి తేనిచో
నత్తరళాక్షి తాన యిటకై చనుదెంచును? ఎంతదూర మ
ప్పత్తన! మంబ హేతువునఁ బంకిలచిత్తుఁడనైతి నక్కటా! 61

ఉ. అంబయుఁగాదు హేతువు రహస్యమునం దొకయుత్తరంబు నే
కంబుజనేత్రికిన్ బనుప నాపె నివారణ చేసెనే? నిమి

త్రం బిటు వేఱుకా దొకస్వతంత్రిక లేమియొ కాదు కాదు డెం
దం బడియేమొ! యెప్పనికిఁ దార్చిన నేగదు నాఁటనుండి యుఞ్. 62

చ. కలికియొ కారణంబిచటఁ గాఁదగు నత్తరళాక్షి పీడి నే
వెలికరుదెంచు టాదిగ నవీనవిధం బొడఁగూడె నేమియుం
దలఁపదు చిత్త, మేమిటికతం బని చింత యొనర్పఁ దాను నం
దులఁ జొరబాఱ దిప్పటికిఁ దోఁచె నిజ మ్మది" యంచు నెంచుచుఞ్. 63

ఉ. నేరము సేయుమానవుఁడు నేతకడఞ్ జనుపోల్కి మోమునం
దీఱిదైన్యముఞ్ మతి మదిఞ్ గదుభీతియుఁ గొంతలజ్జయుఞ్
వారక తోఁప నచ్చటుల వారిజలోచన యున్న చోటికిఞ్
దారె ను దారుఁ డట్లు ముగుఁ దన్వ్యలపట్లఁ గృతాపరాధికిఞ్. 64

క. నలుగడలు గాంచి పదపడి, జలజముఖి వనిం ముఖ్యహాసుచా మఁజని యటఞ్
గలకలికిఁ గాంచినంతన, పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెఞ్. 65

చ. తనుఁ గని మాటలాడ దొకదండము పెట్టెను మోము నెత్త ద
న్వనరుహనేత్రి యుంచు మది వంత యొకింత యుఁ గాంచ కల్లన
ల్లనఁ బ్రియురాలి దగ్గఱి కలాపగతిఞ్ జెను గేఁటి మోము నె
త్తిన శతపత్రనేత్రి యొకతీరున నవ్రిలు బాలువాఱఁగఞ్. 66

ఉ. కొండొకసేపు నేర్పుమెయిఁ గొంటెతనమ్మన మిన్నకుండి "నీ
మిండతనంపుఁ జంద మిది మేలుగనున్నది యెట్టివాఁడవా?
వెండియు రేపె వత్తువని వెళ్లినదే యొకసందు చేసి రా
కుండుట నీవుఁ జెల్లె నిటు లొండొరు లెవ్వరు నేర్తురే బళీ!. 67

చ. ఇరువదియేండ్లప్రాయ మదియే గమనంతకు మిన్నకుండి పై
"నిరువదియేండ్ల యుప్పు వదు" వన్నటు లే నిసుగట్టికొంట యి
క్కర్ణి విచారమందుటకె కాక సుఖమ్మనకా? నిజమ్ముగాఁ
బురుషుల నమ్ముమానినికిఁ బొక్కుటచక్క మఱొండు గల్గునే. 68

మ. మఱు లేకీకరణమ్ముగాంచకయె నమ్మన్మిమ్మికన్ చాలకో
కుతుకంబుల్ నెఱవేఱకో సిరులు లేకో యేదియో మాడిచో
సతికిఞ్ భర్తను నత్త దొక్కయెడ నీసఖ్యమ్ము చేకూఱ దు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదింపఁ బ్రత్యూహ ముఞ్. 69

చ. నినుఁ గనుఁగొంట కిక్కరణి నేనయి వచ్చితి నన్నమాట యే
వనితయు నేని మాకొలము వారలలో విననేని నవ్యకుం
డునె? యెటు నేని సానల కిటుల్ చను టొప్పునె? దానికేమి ప్రీ
తినిగనఁ జేసి తిట్లరుగుదెంచుట శ్రీమన్మన కోర్కి యెమ్మెయిన్. 70

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్య మొకింతయు లేమి వీడి తే
నిం జనుగాని యొక్కచెలి వీడి యొకొక్కక ఫక్కి నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుండు నేరఁ డనఁగా నొకపాటి బొజుం గెఱుంగు నే. 71

చ. వెలచెలినై జనించి కనువేఁడుకలు చెందినపట్లు దానికిన్
గలుగుట యబ్బురంబె! పలుకష్టము, లొడ్డ ననంగ నేల? చం
చల మగు నాదు నెమ్మనము చందము నింద యొనర్పఁగాక యే
లలనలు గాంచిరో? సుఖములన్ వలపుల్ తలకెక్కి పిమ్మటన్." 72

చ. అని పలుమాఱు దూఱు చెలియన్ దగుమాటలు సెప్పి కొంత సి
గ్గున కగుచెయ్వులన్ గొలిపి కొంత కరిమమ్మఁ గుపరిసన్నఁగా
నొనరిచి మించు పేర్మి దళుకొత్త "సఖీ! నినుఁ బాయు టాదిగా
మనమది యేమొకో! పనికిమాలిన దయ్యె నిజమ్ము నమ్మమీ. 73

ఉ. ఇంతియు కాక యున్న నిఁక నే పని నేనియు మాను టొప్పఁగా
కింతిరొ! నీకు నుత్తరము నేనియు వ్రాయనె? యంత పందనే?
కంతునిసాక్షి నేఁడు నినుఁ గాంచితి నెమ్మన మెప్పటట్లు ని
శ్చింతత గాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్. 74

ఉ. వచ్చినతత్క్షణంబ మగువా! యలకాశికి నేగి వాఁడఁ బై
నచ్చగఁ యాత్రఁ జేసికొని యక్కడనుండియు మొన్న వచ్చితిన్
బచ్చని వింటిజోదుకృప వచ్చితి వంతన నీవు, యాత్రికిన్
వచ్చె ఫలంబు, నిక్క మిది వంచన సేయఁడు దైవ మెవ్వరిన్. 75

ఉ. ఈవును నేనునుం గలసి యియ్యెడ హాయిగ నుండవచ్చు సౌ
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివె కాని తల్లి గా
రీవిధ మొప్ప దామె కిది యించుకయున్ దెలియంగరాదు కో
పావిలయై యవో మనకు హాని ఘటించుట నిక్క మెమ్మెయిన్. 76

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియింపుము నాదునామ మెం
దే వచియింపఁబోకు వచియించినమాత్రన యేమిగాని యే
యే౽ధికృత గోప్యగతియే కడుఁ శ్రేయముఁ దాఁగునంచు నీ
కేవల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు నట్టివే. 77

ఉ. పేరగుదాన వీవు, కడుఁ బెంపుగలట్టిది మాకుటుంబ, మీ
కారణమై రహస్య మది గావలసెన్ మతిసెుంచుఁ రీతి యే
నే రెటు సంచరించెదరొ యేరికిఁ గావలె నింతవీట్టిలో
నూరనుగాని యిట్టిపురి నొక్కని కొక్కనికోలి గల్గునే. 78

క. మీపురము లొక్కపదియో, మాపురి విడఁ దీసి కట్ట మానిని! దీనన్
గాఁపురము సేయుగేస్తులు, దాఁపునఁ గలవారి పేరె తా మెఱుఁగరనూ. 79

తే. గీ. అట్టిసంగతిలో నిటు కథిక దూరు, ముందు మావీధి, యిప్పుడేనుందు నిన్ను
నెవఁడు గుర్తించి మాతల్లికెఱుఁగఁ జెప్పు!, నట్లయిన భయ మేలన? నదియు వినుము 80

ఉ. మీపురిలోన నే సలుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
యేపను లేను నీపడకయింట నొనర్చితి వాని నన్నిటిన్
దాఁపక చెప్పినా రెవరొ తల్లి, కిదెక్కడివింత? జాఁదతా
వ్యాప్తి తానరయి జగముపై కసుగుక్ నిజ మింత కోమలీ." 81

క. అఁవుడు జలజాక్షియు బ, గ్గన మండిన పగిదిదోఁపఁ "గుటలవనితగ న
న్నను జూచెదనను టది యె, ల్లను బోయెనె? యెంతలోఁ గుటలనైతిఁ గటా! 82

క. జారుఁడను దుర్యశము పర, నారీల, జోరగతిఁ గూడు నాయుడునను నా
మారమణిఁ గొనిన నీయుప, కీరితి లే దిపుడు నీదుకృప వింటి నిటుల్. 83

క. ఏలంటె వచ్చుఁ? దానై, వేలకువేల్ మెఱుఁగున్న వీటికి నీ కి
ల్లాలనని కొంటి "గలదే, రై" లను మల్లెవఁ దనకు దా నేల? యిటుల్. 84

క. యోగినిగతిఁ గాలమ్మున, నే. గడపుచునుండ నీవు నేరుపమై నన్
భోగినిగఁ జేసి చింతా, భాగినిగాఁ జేయు నుంటి పాడయితిఁ గటా! 85

తే. గీ. మొదల మాతల్లిమాటల మోసపోక, పురుషసాంగత్యమున బుద్ధి పోవనీక
యుండ వాయుండదయొక్కనికొప్పఁజెప్పి, వానివానాఁడ పోఁగొట్టి వ్రతముగొంటి.

ఉ. దానికి సంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుఁగకే కడుమూఢమునన్ దిగునిన్నుఁ జూచి మా

యూనిధిగా గణింప కకటా! తుద కెందుకుఁ గాని పండ్రనై
బానిసతో త్తనై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. 87

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుంగొలమ్ము? పై
నందముఁ జందమున్ గలుగునట్లు లొనర్చఁగ నేల? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగ నేల? యూరకే
కుందఁగఁ జేసి యక్కటఁ గుత్తుక గోయఁగ నేల? యక్కటా. 88

ఉ. అందముఁ జందముం గనియు యాదరము న్నిజ మంచు నమ్మియో
వందలు వేలు నీయఁదగు వాఁడనియో యొకమాయ కానికిన్
డెందము నమ్మి వానికిఁ గడించిగఁ బ్రియము ధారవోసి యం
తం దను వీడ నేడ్చెడియనాధనులమ్మనఁ బుట్టఁ జెల్లునే? 89

చ. కలుగుట దుర్లభం బొకఁడుకల్గినఁ బెద్దరవాస్య మందునన్
దలరక యొప్పుకొన్నఁ దుదిదాకను నెగ్గను వానిచెల్మి యే
వెలచెలియేని యొక్కయెడఁ బ్రీతియొ ర్చుట తప్పిదంబు, పం
దలయినఁ దప్ప నొండుగతిజన్యాలు దీన జనింపు టొప్పునే. 90

చ. కలిమిని లేమి నొక్కగతి గారవమున్ బచరించుచున్ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ దార్పిననిపుణ్మటు నేనెఁ బూర్వపుం
జెలిమి యొకించుకేని యెడనేయని చెన్నటిగల్గునింతి కం
జలి యొనరింప నొప్పు దివిపుత్త్రిత యుంచినసానియేనికున్. 91

సీ. తగినసంతాన మ్మొదయమందిన "నాయనా!" యని వారి లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గొంటవార్లు లుండిన వారు తల లేమంచు నెత్తఁగవలయు?
తనుఁగన్నతండ్రి యుత్తముఁడేని యతని మొగ మ్మెమ్మిగతిని దాఁగాంచవలయు?
ఏదేని శుభకార్య మేతీర నెవనితోఁ గాంతుమైఁ బీఠ మెక్కఁగవలయు?
తే. గీ. నక్కటా! తాను బాడగు టట్టులుండ, వెదకముందటివారల వెలికిఁ దార్చు
రోవెలందుల పుట్టువుల్ రోఁత గావె, యొలుగనేర రీమార్గమ్ము హీనమతులు.

ఉ. అట్టివిధుల మ్మనం బెటులనైన మరేమి పుర కృశమ్మునన్
బుట్టినదానికిన్ వగఁగఁ బూనిన లాభము గల్గఁబోదు తాఁ
గట్టినకర్మముల్ కుడువఁగాంచక తీఱునె? యిప్పుడేని యా
గుట్టు నెఱింగి యొక్కరుని గూడి దినమ్ములు పుచ్చఁ జెల్లదే? 93

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పుగఁ జేసెడి చానపొందులే
ఫక్కిని జారుఁడన్న దురుపద్రవముల్ గలిగించు వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మళయాళమందుఁ జే
రెక్కుడి నగ్రజాతులు హీనకులాంగనతోడి కూటముల్. 94

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని నొల్ల "భా
ర్యావిధిఁ జూచుకో" మ్మనుచు నప్పుడ చెప్పె మదంబ, దానికి
న్నీ వెటు లొప్పికొంటి? వది నేఁడిటులన్ గిన్కరింతె? మాకొలం
బేవగదైన మాసరణి యేవము పైఁప దదెన్ని భంగులన్. 95

క. అనవుడు సుదారుఁ డచ్చెలి, కను "నే లోకోక్తి నంటి నది నీకింతన్
మనము నలయించెనే? యే, మని భార్యఁగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. 96

ఉ. చక్కఁదనమ్ములేదో? గుణసంపదలేదో? వయస్సులేదో? బల్
తక్కులమారిగావో? వివిధమ్ములు విద్దెలు నేరవో? నినున్
జిక్కనికాఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్య గీర్యయున్
మక్కువకానె? యేల యనుమానము? మానుము మానినీమణీ 97

ఉ. నమ్మవుగాని నీవు మదిపాటిన దాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతిం గనదు నేరము లూరక లోఁచు దానిపై
నెమ్మెయిఁ బూను నీగుణములే కద! యింతకు గారణమ్ము, నీ
సొమ్మనుకొమ్ము నన్నను దిశుద్ధిగ మాటలు వేయునేటికిన్. 98

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ, గలదు స్వాతంత్ర్య 'మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొందఱడ్డిరి గాని యింత, మాత్రమున, బోయెనే? పూర్వమతమునకియు.

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో సంసారియైన విశ్వాసి యొకఁడు
ముగురముల్ జంపినముండమోపిని గట్టికొని గృహస్థయిన మునుఁ డొకండు
ఏకమత్స్యమున కియ్యవి ముప్పనుచుఁ గులాచారముల్ వదలినజాణ యొకఁడు
"పింగాళిచిప్పకు వెండిగిన్నెకు భేదమున్న దె!" యనిగోడి యోగ్యుఁ డొకఁడు

తే. గీ. వీరలేకద! సభలలోఁ బెద్ద లిపుడు, మనకు మర్యాద వీర లేమని యొనర్ప
రింతకును దిర్వ్యకంతున కెవనితోడ, నేమిపని? కలి యాతని నేమి సేయు?

ఉ. జనని గతించుదాఁక నొక చందమునన్ జననిమ్మ మీఁద ని
న్నును స్వగృహమ్మునం దిడుచు నూతనబుద్ధి యొకింతలేక నా

జన పదియెల్ల నీవు నుపచారము సల్పెదు నట్లొనర్ప న
న్ననియెడి వాఁడొకండు గలఁడా? మఱి తల్లి కొకింత జంకెదన్. 101

ఉ. దాఁపఁగ నేల? విన్ము మును తండ్రి గతించెడువేళ ద్రవ్యముల్
చూపి మదంబతో "నిది త్రిశుద్ధిగ నీ మరణంపువేళ నీ
వీపసివాని కిమ్మఁటట నించుకయేని వ్యయింప కంతలో
నోపినమాత్రముం గలిపి యుంచ్చగదన్ బొసరింపఁగాఁదగున్." 102

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య, మవల నవివేక మిత్యాని యందుము నొక్క
టొక్కటియె మానవుని నిడియొకటువన్ని, యును బొసఁగ నేనిఁజెప్ప నేమందు సాధ్వి.

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ గాంగి చల్లనా
రి వెలయుపాలభంగి నొకరీతికి వచ్చెడుదక్క బాగరూ
కవిధిని సర్వసుఖం బయినిగాంచుచు ద్రవ్యము చేతి కీక పై
న్యవహృతిశాలి యైనయపు డంతయు వానికిఁ జెందఁజేయుమీ. 104

చ. అని పలునీతులన్ దెలిపి యా పెరు సర్వము నప్పగించెఁ గా
వున మన కామిసమ్మతిని బూనక చెల్లదు దానఁజేసి ని
న్ననిచెద వేఁటుగాఁ, బిడప నోపిక వెట్టితి వేని యెల్లగన్
బనిఁగొను దానవై మెలఁగవచ్చును బొచ్చెము లేనితీరునన్. 105

చ. అఁవుడు నవ్వెఁదియును నక్కట? యెందుల కింతసోద? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెడుఁగాక నీధనం
బును సుఖముండెఁగాక నను మోసము చేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు వచ్చెఁ బదికోటులు దానన నిక్కమింతయున్. 106

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నినిఁ గొనిపోయిరే? జగతి నీతి యనీతి యెఱుంగి వ్యక్తులున్
దనచను వేళ నెట్టుఁబడుఁ దక్కినదంతయు దూరదూరమై
పనుపడు దీనికేమి! పదివాళులు నీకృప గాంచఁగల్గితిన్. 107

ఉ. పిన్నటనాఁటనుండి కడఁబెంకెతనమ్మున నుంటి కాని మా
కన్నెఁబోలె నెల్లరకుఁ గాళ్ళకు మొక్కెడి దానఁగాను నా
మన్నికంబు సాగుటకు మూలమవై ననుఁ గొంటివీవు లే
కున్న మఱేమిలే ధనము, లుల్లము చల్లఁబడె న్నిజమ్ముగన్. 108

ఉ. ఏమనఁ! దెల్పరాన విను మే మొద లీకొలమందుఁ బుట్టి లే
దేమనుజుండు నన్గనెనొ యొక్కతె తల్లియు యే నెఱుంగ న
న్నే మెయిఁ దాను గన్గనెనొ! యిట్టియది పెంచియుఁ బెద్దఁ జేసి బల్
క్షేమము లోలి నేర్పెఁ! గులనీతికిఁ దావలమై చెలంగఁగన్. 109

క. అనీతులు నామది కిం, చినిం జొరబాఱ వేగతిన్నేర్చును! చి
త్తైకనెగడనిపక్షికి. భా, షానియతి న్నేర్పఁ, గులమ చను ముఖ్యంబై 110

క. సంగీతము సాహిత్యమ్ముం గొమరగు నభినయమ్ము ముగుదలకెల్లన్
సంగతములగుట నాకుఁ బొ,సంగున్ దగు పాటిప్రజ్ఞ జగదీశుకృపన్. 111

ఉ. ఇంతవు నాకొలమ్ము మొద లెయ్యదియో విననైతిఁ దల్లితోఁ
బంతము పట్టికోరినను "బ్రాహ్మణకన్య" వటందుఁ బల్కె నే
వింతవిధమ్మున న్ననువివేకవిహీన మదంబ గాంచి ని
శ్చింత మెయిన్ ద్యజించెనొ యిసీ! పసుపుంగొల మాశ్రయించితిన్. 112

ఉ. కోపము వచ్చు మీ కనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్మునం
దేపగుచున్న దీయధమవృత్తి యదేమనఁ! బెద్దవృద్ధు తా
నేపసిపాపనో ధనమునిచ్చి కొనున్ గనునంత మృత్యు, వా
పాపిని మమ్ముఁ బోటుల నపారము గాఁగని యిట్లొనర్చెడిన్. 118

శా. పోనీ స్త్రీలు పునర్వివాహమునకున్ బోరామి వాదింతు వి
జ్ఞానుల్ పండితు లేమిపాపమొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ
వానిన్ జేర్చునపాత్రుఁ గూడ దన రవ్వాఁడిచ్చు నన్నోదనా
లానందమ్ము మెయిన్ భుజింతు రిది యన్యాయమ్ము గాదందునే. 114

శా. కన్యావిక్రియ మాఁగలేని యలవిజ్ఞానుల్ మహేచుంచుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాపంగ వే
దక్కన్యోజింతురు రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటన్
మాన్యత్వమ్ము మఱొక్కటన్ దొసఁగ దేమాడ్కిన్ బొసంగింతురో. 115

మ. పతితోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పై నాఁడువో
వుతటిన్ మటివిరక్తిమై సకలమా భోగమ్ములన్ వీడి పో

డితలఁ దాల్చి యతిస్థితిఁ గనుట పాటింపక దగుఁ గాని చి
న్నతనమ్మందున నాలుగేసులపుడే నా! యిట్టి వైరాగ్యముల్. 116

ఉ. అట్టివయస్సునన్ విధవనై యది యెందుకెఱుంగనప్పుడా
బొట్టెటు గాంచి కొంద "ఱిసి పూర్వయునం డిటు పెట్టిపెట్టె" నం
చెట్టులొ పల్కుచుక్ మఱి యదే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టులు పల్కరాదె? యను డెక్కడికేగెఁ బురాకృతం బహో! 117

తే. గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు, నంచుఁ దర్కింపఁగా నియ్యె యబలలైన
బాలవిధవలపట్లనా! పండితులకుఁ, గల్గుపాండిత్యమెల్లఁ జక్కఁగనడమట. 118

శా. సూజన్ మొక్కుచు శాస్త్రనేతఁ గడుగర్ శాపం బటుండంగ లో
నం "జంకర్ మన మిట్టులుంటి మిది యంతర్వాణి లీక్షించి రే
నిం జాలక్ వెలియాత" నటంచు నొక రేనిన్ వారి వారింప రి
క్కంజాతుల్ శమధర్మశాస్త్ర్యులకున్ గన్పట్టి రెప్పట్టునన్. 119

ఉ. మాలల వంటుకోనిజనమాన్యులు, తుమ్మిలు చేసి తెచ్చు భ
క్ష్యాలు భుజింపనట్టి గుణగణ్యులు, మీకులమందు నేఁడు లే
రీలలి సంచరించు ఘను లెల్లరుఁ బంక్తికి నర్హులై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లాయరో? 120

శా. ఆయాసూక్ష్మమున బండితుల్ గలరుగా! యందెందు విద్యాధులే
మీ! యేర్పాటుగ నుండిరే? యుచట లేరే? దుర్కులున్ మాలలున్
నీ! యీయెల్లర కందు వేదముయున్ జెప్పంగఁ దా మొప్ప వి
ద్యాయత్తుల్ కులవంతులై విధవ పెండ్లాటకున్ గులంబూడెనే! 121

ఉ. కావున నేను నీపిదప కాలమునందలి విప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చును సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు నానకట్టుకున్
గావలెఁ బూర్వమం, దిపుడు గైకొనువా రెవ? రాపచారముల్ 122

తే. గీ. ఎవరుపూర్వపుటాచారమెఱుఁగువారొ, వారలకుశాస్త్రము త్తరవాదియిచటఁ
దక్కువారల కీజోలికపుల దెవ్వ, రేని నడిగిన నోరెత్త రిట్టులనిన. 123

ఉ. నావుడు నవ్వి "యాకొలమునం గల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె? నీచులు మాన్యత గాంచఁబట్టి యీ
యీవిధు లిట్టు లయ్యె నిదియే మన పూర్వపుఁ గాలమైనచోఁ
బావనపుం గొలమ్ము లిటు పాడయినన్ బుధు లూరకుందురే? 124

మ. సరసంబా? కతిఁ బల్కితీవు జలరత్నన్యాస మన్నట్లు ని
ష్ఠురమా జవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె
వ్వరికో జంకి యొనర్చు చేష్టలు నిల్వన్నేర్చునే? జన్మమే
బరువై తోఁచెను భర్తలేని సతికిన్, బైమాట లింకేటికిన్. 125

మ. పతిపోవన్ బలవద్గతిన్ సతిని దగ్ధం బ్రింగమంచుంచి వే
చితి నంటించెడు ఘోరపుం గృతిని వారింగట్టి పెట్టించి రే
మతిమంతుల్, తగవార లిట్టు బలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరా దటం" చనిన నీహింసస్థితుల్ తగ్గెడిన్. 126

మ. "పదియేఁడుల్ చనుమీఁదఁ జేయఁదగు నాపై రెండు నాఁటంగ రా
దిదిరో! స్త్రీలకుఁ బెండ్లికిం జతి" యటం చేర్పాటు గావించుచో
ముదికల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పున్ దానిచేఁ దగ్గుఁ దొం
బదిపాళ్ళిమరుపద్రవం, బదియు విద్యాశ్వస్మృతిన్ గాఁదగున్. 127

తే. గీ. ఈతువచ్చినకన్నియ నెవ్వఁడేని, వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధి సాగు?
నక్కటా! యెన్ని వృత్తులో యువనిమండఁ, బంద తీవృత్తికతన జీవనముఁ గొందురు.

తే. గీ. అప్పదీక్షితు లొక్కపట్టాత్మజాత, కిట్టి దురవస్థ గల్గఁ దానెఱుకఁ గల్మి
స్త్రీపునఃపరిణయములు సేయఁబూని, యెంత వెనుకదీసెనఁటు తల్లి యొప్పకునికి.

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటి విప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, వృథాఁతి వారలగోడు వోసికో
నొప్పుటనన్నఁ బండితుల కొండొక దోసము సేను పెక్కులౌ
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! 130

తే. గీ. అరయఁగాలేక మిముటు వెలయాఁడ్రిటు పొందురి గాని, యీ యుగ్మమది నేఁటి కాలమందు
ద్రవ్యమిడి పెండ్లియాడిన ధన్యతముల, భాగ్యలకు నెల్లఁ జెల్లఁగావచ్చుఁ గాదె.

ఉ. సాంకర్యమ్ము తటస్థమౌననుచు విశ్వస్తావివాహమ్ము వి
ద్యాంశుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ
పంకంబున్ ఘటియించుచో నిటు లనన్ బాగౌ దనంతన్ జగం
బింకం బావెడిపట్ల నీనియమ మిందెవ్వాఁడు పాటించెడిన్. 132

ఉ. భూతి మొగమ్మునం గలుగు పుణ్యుఁడు పొద్దున స్నానసంధ్యలన్
జేతము జొన్ప వైదికపుఁ జెయ్వులమానిసి నూటి కొక్కఁడే
నీతఁడెఁ గానరాఁ డిపు డివేటికిఁ? బూర్వపుగాథ లేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరావొకో. 133

శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ము లయి తద్వాక్యాల్ భవిష్యద్గతిన్
బూసన్ గుచ్చినరీతిఁ జెప్పు టది యుండన్ బోవండి యౌరౌర! వీ
రే సార్వజ్ఞులు? వీరి కయ్యెడల లేనేలేదు విశ్వాస, మీ
యీ సల్లే నెటు లుండు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్. 134

గీ. అనుచు వాయాయిగోష్ఠి నతఁడు నదియుఁ, గొంతతడవు వాదమ్ము దమంతనల్పి
“మనకు నీగొడవేటికే? ఘనులు దీని, నిందు” రని విరమించి పైవేడ్క దనర. 135

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత, తడవుగడపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి నతిరహస్య, మైనగతి వానిపొందు దా నందుచుండె. 136

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
జతుర్థాశ్వాసము.



# పాణిగృహీత

## పంచమాశ్వాసము.



సరసాంతఃకరణా సు
స్థిరగానాభరణ నిత్యచింతితభగవ
చ్చరణ కవితాదరణ సుహృ
చిర వితరణ కీర్తికామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు కొంత, కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోటఁ, దల్లి యెల్లసంగతి విని తల్లడిల్లి. 2

మ. అకటా! పుట్టి రోగముల్, మొదటనే యంతమ్ము గావించి పు
త్రిక యీ యోగ్యం బొనరించి నా మనముఁ జేతంబందు నూహించి యీ
సకలమ్ముల్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్ప్రకృతిన్ మానఁడు నైఁచు పెట్టు లిఁక? నింటన్ వంటు లేవిప్పుడుల్. 3

తే. గీ. వేదశాస్త్రమ్ములందు వివేకులైన, రాజసభల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీలఁగ్రిపారములను, బూర్వ్యులివి వీనికతమున బూడిఁగలిసె. 4

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడు నెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యమున్
జెన్నొందన్ విడుచున్న దేమిగతి? నీ చెయ్వుల్ వినన్ గోత్రమై
నన్నున్ గాల్చుచునున్న విట్టిపనులున్, న్యాయంబె? నీ కోటికిన్. 5

చ. ఎఱిఁగియు నేరకో మొదట నేవపుఁ గార్యము నప్పటిపు నైఁ
దిరిగియుఁ శుద్ధిఁ బొందితి పతివ్రత యా కులకాంత యుండఁగా నె
ట్ట్యేతికము మాని యిప్పుడు పురిం దిరిగి సతిని గుత్తగొందువా?
సిరిగల కొంపనుం గలిగెఁ జేటిఁక మాటలు వేయు నేటికిన్. 6

ఉ. ఎవ్వరిఁ బంపినా వచటి కిచ్చెదు ముండకు నైన, తనంతఁ దా
నెవ్వఁడు వచ్చె? "నెయ్యెడల కంపుల కేగవు?" యంచు నెంచితిన్
అవ్వగదా? దినమ్మున రాతిరి చెయ్వులె? నీదు వర్తనల్
నవ్వరె? యెవ్వరేనియుఁ, బనాయువుఁ జేసినఁ గోఁతి యయ్యెనే? 7

క. ఏమేమి నగలు నాణెము, లామాదిగ ముండ కిడితి? హారారా రా
సీ! మూర్ఖ! నిన్ను నీవయి, నేమియొనర్చినను బాప మించుక గలదే? 8

క. అని యేమేమో యదలుచుఁ, గినుకతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినన్
దనుఁగాని యట్లువినియును, వినని గతిన్ జెవి నొకింత పెట్టక యతఁడున్. 9

ఆ. వె. భయమువీడి పట్టపగలును చేయుచు, దాని యింటనుంటఁ దక్క నన్య
మించుకయును లేక యిల్లాలి మాటయే, తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. 10

గీ. 'అంతకంతకు మొరడయ్యె నహహా! వీఁడు, భార్యఁజూడఁడు వ్యవహారపథముఁగాంచఁ
డేమిగతి?' యని యోచితా నేమియనక, తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. 11

చ. అరమరలేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుచున్
జిరమునుండి స్వీయగృహాసేవకు నాశ్రితుఁ డైనయోగ్యు నొ
క్కరుఁ గని "పుత్రు నీతిపరుఁగా నొనరింపు" మటన్న నాతఁడు
ధ్రువమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. 12

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ జోరుగా?
కులమన్నన్ గులమా? ద్విజాతి, యది చేకూఱన్ వశంబే? తమ
జ్జ్వలతన్ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు దు
శ్చలముంబూని యధోగతిం బడు టిదేచందంబు? నీబోటికిన్. 13

ఉ. జన్మములన్ బొనర్చుటో! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్నన కెక్కు పండితుల మన్పుటో! చుట్టుల నాదరించుటో!
విన్నఁదనమ్ము రాదె? సువివేకము పోదె? పురాకృతంపుభా
గ్యోన్నతి మన్నగాదె? యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. 14

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని వె. వెలంగులఁ గాంచి కులుకరైరి
ఉపనిషత్కాంతల నంచుకొనిరిగాని పశుపుత్రోత్తుల యాసఁ బాఱరైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని కులవిహీనలఁ జేరఁ దలఁప రైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని గుత్తలంజెలఁ బొందు గోర రైరి;

తే. గీ. తరతరమ్ములనుండి యిందఱకు మిక్కొ, ఇమ్మువారలు నేఁటి కీలలనకు తనఁ
గోలుకకు నీకు నిపాపదమ్ములకు నొక్క, పెట్టఁజెడఁదగినంత యక్కట్టువచ్చె. 15

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు, లహహా! పరమునఁ జేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియె జన్మములు కోర్కె, యింకయు లేక చేయుట యావు వినవె?

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికల్మికి నెల్లవై యని
ర్వేదమనమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయావన
శ్రీ దిగులొందఁ బాడువెలచేడియ నుంచెడి నిన్ను బోటికిన్
మాదిరిసేయ నీ భువనమండలి నొండొక డుండఁబోలు నే? 17

మ. తిరుగుంబోతులు లేరె? వారిఁ గనియున్ ధీజాడ్యమే లేసిపో
నరుఁడెవ్వాఁ డిల వారకామినుల సౌందర్యమ్ము వాసించు? నీ
మరియాదెట్టిది? నేఁటి నీనడత కేమాన్యుండు లోఁగుండఁ? డొ
ప్పరికింపందగు నే? కనుంగొనుచు మీపాపంబు మాబోఁట్లకున్. 18

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ. సదా
చారం బాఱడియౌ, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు,సం
సారం బగ్గని వ్రగ్గు, నెల్లెడల నిస్సారత్వమే తోఁచు, నీ
వారస్త్రీ సురతప్రశంస దగునే? వర్ధిల్లు సంసారికిన్. 19

క. అని యేమేమో తా నే, ర్చిన విధమున బోధసేయఁ జెవినిడక యతం
డనయము ననయంపుఁదవ, ర్తన మానఁడ, యిటులమనము తరమే? త్రిప్పన్. 20

వ. ఇట్లు పలువురు సెప్పందొడంగుటయు.

మ. ఇదిగాదంచు మనమ్మునం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్ దగఁదెల్పి "మంచి" దనుచున్ డెందమ్ము పొంగార నొ
క్కదినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం బేగుదెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. 21

ఉ. ఆపురి వీరిపూర్వులకు నాకరమౌటను దండ్రి యచ్చోటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయింఁతి నొకర్తుక నుంచెఁ జచ్చెఁగా
కాపురుషుండు సైఁపఁగలఁడా? యిది దాఁ గనులారఁ గాంచియున్. 22

ఉ. జ్ఞాతులఁ దక్కుబంధుగులఁ గాంచి "యహో! యిది యేమివింత? దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపమై మఱలింత" మంచుఁ బో

సారఁడు వారి వచ్చుటకె యాజ్ఞనొసంగఁడు లజ్జ పుట్టదు
న్నే? తగుబంధువర్గ "ఛిహిహీ!" యని యగ్రమునంద నవ్వనే. 23

ఉ. నవ్వుదు రెల్లవా రని మనమ్మునఁ దా నెఱుఁగండొ? యెక్కడా
అవ్వరు నాకరంబగుట ప్రాజ్ఞతమం దగదం చెఱుంగఁడో?
యవ్వమఁగాక భార్యయను నంతరమున్నె పరుండు నై బుధుల్
ప్రివ్వఁగఁ బెట్టు దుశ్చరిత రోయని యాయన నేమనన్ దగున్. 24

శా. ఆనీటున్ వెడగుంబొజుంగు భవనమ్ము దెల్లెపన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్కాంతా వినోదమ్ములా!
సూనాస్త్రాగమ చర్చలా! మిగుల మెచ్చంగల్గఁగాఁ జేయు లా
స్యాంతానుభవమ్ములా! యొలయు నీయూవేళ నా కెప్పుడున్. 25

ఉ. తిట్టఁగనిమ్ము తల్లి, సుదతీమణి భోజన మేద్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలుగాక చెల్లని,
మ్మట్టి యఖండ సౌఖ్యముల నందుమిఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? 26

శా. ఇచ్చున్ మద్దెలపిద్దెవారలకుఁ, దా నిచ్చున్ దగన్ బాడుచోఁ
బొచ్చెంబింతయు లేనిస్నేహితులకున్ బూఁబోండ్లకో యిచ్చు రా
నిచ్చున్ బంక్తికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంత యే
నిచ్చున్ "ఖర్చిది యాయమింత" యని, వాఁ డేమింకఁ గానుండెనో? 27

ఉ. తల్లికిఁ జిక్కి ద్రిక్య మది దక్కి సమస్తము నాలుగేండ్లలో
డొల్లఁగఁ జేసి యాపయిఁ గడున్ విలువైన తగు నగ్రహారపుం
బల్లెలనిస్తు చాల కవి బంధకముంచి ఋణమ్ముఁ జేసి తాఁ
జెల్లఁగఁ జేయుఁ బల్వగలఁ జేతికి నెమ్మొక యింత యుండమిన్. 28

తే. గీ. తనముపంక్తిని నన్నపత్రమ్ము జరుగఁ, గామపత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యవారునిఁ గొల్చుచు నెయ్యరెంద, రెందఱో సోమరులు పొల్తురెసక మెసఁగ. 29

ఉ. గాయన గాయనీమణు లొకానొక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి వాటవెలందివోలెఁ దా
హాయిగ జంత్రపుం గల యొయార మెసంగఁ బొసంగి లొంగె నా
తీయఁదనంబు మెచ్చెనరుదీయక గాయనఁ డెట్టిఁడేని యున్. 30

తే. గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కలికిఁ దాను, శిష్యభావమ్ము గైకొని చెలిమికలిమి
దానఁ గలుగు విశేషముల్ తగినకొలఁది, నార్జనముచేసి కాని యయ్యనఘు విడదు 31

ఉ. దాతృత్వమ్మున మించియుఁ దా మిగుల విద్యాసక్తి రాణించియుఁ దా
మాత్సర్యము దారదూరగతియున్ మాన్యేతరుంగా నవ
ఖ్యాతుంగాఁ దనుఁ జేయు నాథుఁ డది లోఁగాంచంగ లేకెప్డు లీ
లాతాత్పర్య పరీతుఁడై కడపుఁ గాలం బెల్ల హేలాగతిన్. 32

క. ఆకలికి వర్తనంబది, లోకుల కొకరీతినైన, లోనతనికిఁ ద
ద్వ్యాకులచిత్తుఁడగుట నాహా కలిగించి "యది భార్యయగు" ననిపించెన్. 33

తే. గీ. "పీనితో నవ్వె మున్న నవ్వానితోడ, నొక్కటే శయ్యఁ గూర్చుండె నూరకుంట
తగవె?" యని యెవ్వరేనియుఁ దనకుఁ జెప్ప, వినఁడు విననేని నమ్మఁడవ్విధము సుంత.

తే. గీ. గాక రాగట్టుమాని యఖండనీతి, నాకరంబగు కులకాంత యట్లు నవ్వె
లంది వేషభాషాదుల నంది మైకి, సంచరించుఁ గులాచార సరణి విడిగి. 34

మ. ధనమందిచ్చను గాదుగాని యల కాంతారత్న మప్డప్డు నా
థునిఁ బాడన్ గవిగాయకుల్ చనుదు నందున్ వచ్చువానిన్ దనం
తన యేవేళనొ వశ్యుఁ జేసికొని విత్తంబిచ్చు భర్తన్ జయిం
పనొకో నాగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. 36

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హాయిగఁ బాడెడి వానికన్నులన్
వాచవిగాఁ గవిత్వ మొక వైఖరి సుంత రచించు వానిపైఁ
బూచు మనంబు, తాదృశుని పొందునకై మది నూరుచుండు నా
లోచనసేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. 37

తే. గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ, బద్దమిచ్చుఁ గవి బచ్చు దాబైచు ముష్టి
యొకని మెచ్చునో కాంత యయ్యెమ్మెకాని, కతను పట్టాభిషేకమ్ము నాచరించు. 38

ఉ. ఈగతి నప్పుడప్డు ప్రియుఁ డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారికై యాత్మగతిత్వము వెల్లడించు నా
హా గదియెల్ల! కల్లరిగఁ బై వినువారలు నవ్వుచుండ్రి హా!
భోగము దాని నంచుకొనఁబోలునె? యెంతటి పందకేనియున్. 39

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మరులూని యెన్నఁడే
నీ యది యెంతగాఁ దనవు నెగ్గు ఘటింపదుగాని యొక్కటే
"వ్వా" యని యుంచుకొన్న వెలినాయఁకన్నను హీనుఁ డున్నె? యే
జాయి సహింపనేర్చు నది యాఁడు లొనర్చి యమర్చు సేవముల్. 40

మ. వ్యభిచారంబన వారకామినుల కావంతేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ దోఁచ "నది గోప్యంబేల? గావింతు" ర
న్న! "భృతిన్ దెచ్చియొసంగు నాథుఁ డదివిన్నన్ జీవనంబూడు" నం
చు భయానన్, గులకాంతరీతు లెటువచ్చున్? వాండ్రి నెట్లుంచినన్. 41

చ. సరసతగల్గువాఁడు గడుసంపద నొప్పెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁ డబ్బినన్ దరి
ద్రిరతికి నాస చేయునఁట తా వెలయాలిది స్త్రీలజాతికే
పరిచితి గన్న దోస మొకబాసిలన్ వెలిఁ జేయనేటికిన్. 42

మ. "ధనమేలా? సొగసేల? చక్కనికవిత్వం బెన్నఁడే నేర్చు వా
నిని మెచ్చన్ దగు, మాటలాడఁ దగు వానిన్ బిల్చి, యవ్వానికిన్
జనవీయన్ దగు, వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్ దగున్
వనితాచిత్తహరుండు వాఁ" డనుచు నవ్వ్యామాక్షి లో నెంచెడిన్. 43

ఉ. ఏగతినైన మేటి సుకవీంద్రునిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాగతిఁ జక్కనేర్చికొను నాస దినమ్మును వృద్ధిఁ బొంద నా
బోగముచాన ఫూన్కి మెయిఁ బొత్తములెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె నాత్మకులలోలకలోచనలన్ గవిత్వముల్. 44

తే. గీ. రాధికాసాంత్వనమ్మును రచనఁ జేసి, పేరుగనుముద్దుపళని తెల్వియును విజయ
నగరభూపాలుఁ డుంచిన నాతిచాటు, పద్యములు గాంచి యాకీర్తి వశయనెంచి. 45

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమమున్ వేశ్య నోశ్లాఘించి త
ద్దయుఁ దావిద్దియయందు నెమ్మనము శ్రద్ధాబద్ధమై యుంటఁ జె
ప్పినను "వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్ వలె" న్నాఁగ నా
దయితుం డాప్రియురాలి కిట్టులను విద్యావిత్త్వ మొప్పారఁగన్. 46

మ. కవనంబన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రాదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్నపైఁ గాని యా

చని శాస్త్రజ్ఞులకేనిఁ గల్గ దడిమూసక బొందఁగాఁ బోవు మే
వివరింపన్ గలవా! యటుల్ గలుగు నాభేదమ్ములెల్లన్ జెలీ. 47

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్ములు వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణులసభల్ పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ బడవలెఁ బడరానిపాటులెల్ల
వినఁగావలెను బూర్వవిద్వచ్చరిత్రముల్ దర్శింపవలెను ఛందఃప్రశంస

తే. గీ. కవులకవులన్నమాత్రాన కవులుగారు, ఎంతభారమ్ముగలదో కవీశ్వరులకుఁ
దెలిసికొంటివె! యిదియు విద్దెలకునెల్ల, ఫలము దీనికి యత్నించు టలఁతి యగునె.

క. అన నదియిట్లను "నంతటి, ఘనమగు కష్టమ్ము దానఁ గలదేనియు నె
క్కొని యిపుడు కవిత సెప్పెడి, జనులకు మీ చెప్పినట్టి శక్తులు కలవే! 49

తే గీ. దేవభాషాకవిత్వవిధికి విశేష, శాస్త్రవిజ్ఞాన మది యవసరముగాని
దేశభాషాకవిత్వవిధికి నిదేల? మెఱుఁగ నని చెప్పటో? నాకు నిదియునెల్ల. 50

చ. వెనుపటి నాటకమ్ములును మున్నటి మేటిప్రబంధముల్ తెఱం
గొనరుచు నేఁటి కైపదుల కున్నవె? శాస్త్రపరిశ్రమమ్ముల
య్యనఘుల సత్ప్రబంధముల నందఁగ మెచ్చుటలేదె? ధారయుం
డినయెడఁ జెప్పఁగొప్పగుఁ గడిందిగఁ గావ్యము లెవ్వరేనియున్. 51

ఉ. నావుఁడు నాతఁ డిట్టులను నాతిరో! నన్నయభట్టుఁ డాది వి
ద్యావిదులెల్ల నాంధ్రమున నందుఁ గవిత్వము చెప్పిరొఁగదా!
యా విదితాత్ములొక్క తెలుఁగా? తమ రభ్యసనం బొనర్చు, టా
దేవవచఃకలాపములు తెల్లముసేయవె? వారి పాండితిన్. 52

గీ. తెలుఁగు తెలుఁగని యుద్దాన దిగుటె కాని, సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ, జాలు దాని, కిద్దానికో! రెంటఁ దగులవలయు.

ఉ. ఇప్పటి కైతగాండ్రహహా! యింగిలిపీ సోకయింత నేర్చి పై
జెప్పెద రాంధ్రపుంగవుల, నీ! యవి పండితు లాదరింతురే?
తప్పులతుప్పలక్కృతులు తంపుకుఁ బెట్టుటకేనిఁ బూర్వమం
దొప్పిరె? వీరిఁ జూచి యొకొ? యూరక నీమఁ జనించె వేదుఱుల్. 54

ఉ. తప్పని యెవ్వరేని విదితం బొనరించిన నొప్పుకొంటయే
తప్ప నదెందుకో యెఱుఁగు దార్ఢ్యము లేకొక ధార యూఁతగాఁ
జెప్పఁగ నొప్పునే? కవిత, చెప్పినచో నది మానిపెట్టుచే
యొప్పునుగాని పై విడుచు టొప్పునె? లజ్జ గలట్టివారికిన్. 55

చ. మునుపు మహాకవీంద్రులు సముజ్జ్వలభక్తి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె నోటఁబడు తుంప్రులేనియు నిప్పు డచ్చుల
చ్చినకతనన్ జగాన విలసిల్లెఁ గె మేటికృతుల్ నశించెడిన్. 56

ఉ. ధార వృథారసమ్మనరు ధారయిడన్ మననెట్టులొప్పు నో
వీరికి, నెక్కడేనియు వివేకులు గల్గిన వారిఁ గొల్చి త
త్సారము గుర్తెఱింగి తగు శాస్త్రము నేనియు నభ్యసించి యా
పై రచియింపరాదొకో! ప్రబంధము, లేటికి వెఱ్ఱి యల్లికల్? 57

తే. గీ. కాలమహిమమ్ముగాని యేకాలమందు, వచనమురచించువారు కవనమునందుఁ
బేరుగాంచిరి, యెంతటి పేదతనము, వచ్చెఁ గవితాలతాంగి కివ్వారికతన. 58

క. అపశబ్దమ్ములతో వచ,నపుఁగవితలు మొదలువెట్టి నారాయణా! మా
గ్గ్రమునుజు లక్కటా! కవితపదమ్ములు విఱుగఁగొట్టెదరు సిగ్గఱుదై

గీ. సంస్కృతాంధ్రమ్ములందు వచనకవనము, మున్నురచియించువారలు నున్నవార
నర్ఘమగుపాండితియును బహ్యకవనమ్ము, గలిగి విద్యావిదులమెప్పుగాంచువారు. 60

తే. గీ. పాటనుభవించువారు యవారుకొక్క, యిపుడు దారినదగుసంచనరు వారి
సరికదా? వారి కదియు యశము ఘటించు, లేమి నది దరిద్రపువారి కాలీలమెట్లు?

చ. ఇపు డిఁక నొక్కకర్మ నది యేమన? నేర్చినయంతలోనఁ గ
బ్బపుఁబను లాచరింప నది పండితులౌ గవులొప్పఁజూచి "యీ
కవితము చెప్పనేల!" యని గాథముగాఁ దల వాయఁ గొట్టి దా
నిపయి విమర్శనం బొకఁడు నింపుదు రంతరు నుమ్మడుంగుగన్. 52

తే. గీ. కుడిచికూర్చుండి యొక్కచో నడఁగియుండ,లేక నీకేల యీవెఱ్ఱి లేమ! యంత
వలసెనేనియు గానమందలి పరిశ్రమమ్ము హెచ్చించి యటఁ బేరుఁగొమ్మ! కొమ్మ.

చ. అన నది యిట్లుపల్కు "నిజమాడితి రైనను గానవిద్యలోఁ
బని యది యెంతచేసినను బాడెడికీర్తియె తక్క నర్థమున్

గనెడి తెఱంగు గోకిలతయును గల్గదు దాని విధమ్ము లేనిచో
జననము వ్యర్థ మయ్యెడి పొసంగెడి విద్యయె విద్య యెమ్మెయిన్. 64

తే. గీ. అన్ని విద్యలఁ గలుగు సారాంశములును, గవితలో నలరారెడిఁ గానవచ్చుఁ
గాక రాదుండుఁగాక యక్కళలవి యన్ని, మను బొనర్చెదఁ బ్రాప్తమెట్లను నృపడునో

క. పదకవిత మొదల నేర్చితి, నది సామది కంతకష్ట మనిపింపద యే
రోదవింపలేరు వచనము, గదియింపఁగ నెంతుఁ బద్యకవన మ్మింకన్. 66

క. "ముదివిటులు విధవలంజలు, పదకవిత" లటంచుఁ దిట్టె బహుళాంధ్ర ధవో
భ్యారయుఁడు శ్రీనాథుం డని, చదివితి నాపైఁ గోర్కె చదికిలఁబడియెన్.

తే. గీ. కడుపు చెక్కలుగా నవ్వఁగలుగు నకట!, వేణుగోపాలశతకమ్ము వింటిరికద ?
"ద్విపద కావ్యమ్ము ముదిలంజె దిడ్డిగంత" యనుచుఁబడఁదిట్టె నతని నేయమ్మగనెనో.

ఉ. కావున మీర లొక్క కవికంజభవున్ బిలిపించి యాయనన్
జీవనవేతనాదుల వశీకృతుఁగా నొనరించి నన్ను వి
ద్యావతిగా నొనర్చు టది తప్పదు మారలమందు ముందు వి
ద్యావతు లాంధ్రపుం గవితలెల్ల యశస్వినులుండెదుం గరే. 69

చ. అన మనమందు దానిదగు నాస్థకు సంతసమంది "మంచిదే"
యని కడు బుజ్జగించి తగుపట్టి కవీంద్రుని రాఁక గోరుచున్
దినములు పుచ్చుచుండ సుదతీమణి యొక్కెడఁ గోరి నాతనిన్
దనపురిఁ దత్సమేతముగఁ దాఁ జనఁగా నతఁడొప్పె నందుకున్. 70

వ. పదపడి యప్పాణిగృహీతతో సపరివారమ్ముగ భాగధేయపురమ్ము చని యయ్యెడ నొ
క్క చక్కని బాడుగుమాడుగున వసియించి నిరంతర సుఖమ్ముల నోలలాడుచు సం
గీతాది వినోదమ్ములఁ దేలు నవసరమ్మున. 71

చ. కన్నడసీమనుండి యొక గర్భదరిద్రుఁడు సుంతకైత దాఁ
బన్నఁగ నేర్చువాఁడు నొకపాటిగ గాన మెఱుంగువాఁడు రూ
పోన్నతి లేనివాఁడు వయసొప్పెడి వాఁ డొక బ్రాహ్మణుండు వ
చ్చె న్నిజశక్తిఁ జూపి సిరిఁ జెంద నుదారునిఁ జూచు వేడుకన్. 76

మ. పదపద్యమ్ములు కొన్ని చెప్పి తనదౌష్ప్రావీణ్యముం జూప "నే
మిది! నీవున్ గవనమ్ము చెప్పగలవా? యెందెందుఁ బాండిత్యము

న్నది?" యంచుఁ జ్ఫురితపాండితీగరిమ నాయాయావిశేషమ్ములన్
గదలింపన్ వెలఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. 73

ఉ. స్కూలున నింగిలీషు నొక కొంత పఠించితిఁ దెల్గు దానితో
లీలగ నభ్యసించితిని లేమిమెయిన్ బయిరెండు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక చూచి గానపుం
జాలది పూర్వమే కలిగి సాయ మొనర్పఁగ తల్ రచించితిన్. 74

చ. హరికథ లల్లుచున్ గృహము నందలి రిక్తత వాపికొందు నేఁ
డిరిగెద దేశముల్, తగు సుధీమణి శిక్ష యొకింత లేమి సు
స్థిరగతిగాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షుఁ జూఁచి మ
త్పరిచితమైన యట్టికతఁ బాడఁగ నాజ్ఞ యొసంగ వేఁడెదన్. 75

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా! కనఁగొంటివె యాతనిన్? కుటుం
బనియతికై ధనాఢ్యులను వంచనసేయఁ గవిత్వమందుఁ బై
కొని వెతిమొత్తి పద్దెములుకొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పినయదియెల్ల సత్య మనిపించుట కీతని రాఁక యుగ్మలీ! 76

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ, గవులలోపల నిమ్మెడఁ గలియుచుండ్రి
ఎల్ల వర్ణమ్ములును గూడి యుంచుకంత, యంతరము లేక తురకలయందుఁ గలియు.

ఆ. వె. ఇంగిలీషు చదివి యీకవిత్వము సెప్ప, నేల? దానఁ జెప్ప నేల? రాదు
ఉభయభ్రష్టు లిట్టులొనరింతు రీనాఁటఁ, గవుల కింక నేటి గౌరవంబు? 77

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కు విశేష పాండితిన్
గను కవిచంద్రు లిక్కరణిగాఁ జనుదెంతురె? యెల్లచోట్ల కి
య్యనఘుని వాక్యమాధురి సహాస్యము సేయఁగఁ జాలు మీరు వ
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగ నేర్చుఁ గవిత్వ మొప్పఁగన్. 78

చ. చదివెడి శైలి గానపుఁబసం దలరారుటఁ జేసి చక్కఁగా
మదికి ముదం బొసంగఁదగు మంజులమైన పదమ్ము లుంటచేఁ
బొడలు రసంబు, నేరుపును బొల్చెడిఁ దప్పులకేమి? రక్తిసం
పద నడఁగింప నేర్చునె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. 79

తే. గీ. దోసముల్ గల్గుఁగాక నిర్దోసమయ్యగుఁ, గాక రసహీనకృతికన్న ఘనరసాస్ప
దంబగు కవిత్వమెంతయు ముదంబొసంగు, నంకయుతుఁడయ్యు జాబిల్లి హాయినిచ్చు.

శా. ఆమాటల్ విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని స
ర్వామాత్యాదులలోనఁ జేర్చికొని యాయావేళఁ బాడించు చే
మేమో యల్లిక లల్లఁజేయుచును నారాయణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడపుచున్నంతన్ దుదిన్ వానికిన్. 72

చ. ఎదు పోకయింత లేక చరియించుటచే నలకాంతపై మనం
బరిగి యదెంత దిప్పినను నట్టిటు తాఁ జలియింపదయ్యె న
త్తరుణికి నంతకున్ మునుపెఁ దన్మయమయ్యె వనోవికార, మా
యినవుర లోపమేమి? యట నీతనిదే యపరాధ మెమ్మెయిన్. 83

శా. దానిన్ భార్యగ నెంచుకొన్న యతఁ డంతస్తాపితన్ జేయుక
వ్వానిన్ వీనిని గోప్యమం చెఱుఁగ కవ్వామాక్షి కేళీగృహం
బేనిన్ జేర్చునె? యిట్టులైన నది గాదే? సత్సతీరత్నమున్
మానం బూడ్వదె? నిత్యసంగ మది యానాత్మ్యంబు గల్పింపదే? 85

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పెడివారలు వెఱ్ఱి" లంచు మూ
ర్ఖాళి వచింతు రిప్పు డిటు లంగనలన్ సభ కెక్క నిచ్చి యా
మూలమునన్ జెడన్ మొఱఁగు మూసుక మిన్నక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయంరచితాగసు లుండి రక్కటా. 85

క. మును పూర్వులెంతయును నభవ, మునఁ జేసిరొ? కట్టుఁబాటు మూర్ఖులు దానిన్
గననేరక యిహీహీ! యనఁ, జనునే? తమకంతకన్న శక్తులు కలవే? 86

మ. కలుదారివశ జన దంచుఁ జెప్పుటకునై కల్లిచ్చు నాచెట్టు నా
కులుగూడన్ గలవమ్మ లంచుఁ దమవాక్కుల్ శాస్త్రముల్ గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టిసుమహాత్ముల్ కద్దు కైలాసవా
ఖిలులన్ బోలఁగఁ జాలరో? వశమొకో ఖండింప నక్కట్టులన్. 87

తే. గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని, కడుపున కటం చెఱుంగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పుట యొక్కతప్పు, పూర్వులను దూఱుట్రెదియుఁ దప్పుపయితప్పు.

తే. గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ, జెప్పుమను వంత వెట్టిరే? చెడికొలమ్మ
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగనేర, కూరక యశాస్త్రకర్తల మీఁ దనుగునె? 89

ఉ. బోగము దాని కింత తలపోయఁగ నేటికిఁ? గుక్క గోవునుం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము లేఁగి నంచె నేనియున్

స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ దా
యోగిని వంటిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. 90

ఉ. ఆగతి నిర్వరున్ మరుని కగ్గలమై మనమంద మ్రగ్గుచున్
సాగమిఁ బొక్కి "చింతకయు సందగునే?" యని దేవు వేఁడుచున్
రాగమె రోగమై తగఁ గరమ్ము నలందుచుచుండి రంతలో
నాగజమాన సాహసము నాఁడి కృతార్థునిఁ జేసె నాతనిన్ 91

క. సామాన్యయయ్యుఁ బరకీయామాన్యతఁ గాంచి వాని నహమో నిశయో
యేమోలనో చరితార్థుఁ, గా మన్ననసేయు నతని కనుఁబ్రామి యొగిన్. 92

ఉ. నాయకు ప్రక్కలో నిమిడి నాతి యెటుల్ కనిపెట్టునో యతం
డాయతమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?
ప్రేయసి" యంచు లో నొగులుప్రేముడికాని యయ్యమ్మ చేరు నా
మాయలమారి, యయ్యతివ మానస మేమిట ధాత చేసెనో? 93

ఉ. రూపవిహీనుఁ డప్పటుఁడు రూపసి, చీఁకటి వెల్గు, స్థండిలం
బే పఱి, పూరకు డుటయె యింపగు పల్కులు, ధూళి గంద, మే
చాపయు నేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు నేవకుల్
దోఁప వోకించుకేనియును దౌర్బల్యికిన్ బ్రియుఁ డబ్బపట్టుగన్. 94

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట మాతన్ వీడి యవ్యాసమై
నను గాదంచును రోసెనంట యొకఁడై జ్ఞాత్యాదిబంధువ్రజం
బునకున్ దూరగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండనన్. 95

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంత నశించియె? కాదు; లేక ద్రి
వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియె? కామ; యూపసం
ప్రీతియె? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చెనొక్కొ? దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్ని యేటికిన్. 96

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్మానాతిరేకమ్మునన్
దగు విద్యత్తను దక్కభంగులను మందప్రజ్ఞఁగాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్కరీతి మెయి నించున్ మించు గామండ మే
టిగుణిన్ గొల్చునె? సాధ్వి, మానవతు లీశీవుల్ ప్రశంసింతురే? 97

ఉ. “క్షీణగు వీఁడు గాదనికి వేఁటొకఁ డా” నను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రిదఱఁ గాక నుందుగతి గేహమునం దిడ గేహినీగతుల్
పాదుకొలమ్మకొమ్మలకుఁ బట్టునె? పైపయి నవ్వియున్నవే? 98

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁక న
మ్మను బిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వసృస్తోమమున్
దనతోఁబుట్టువులన్ మరల్ గొలిపి విత్తమ్మిచ్చి భోగించు దు
ర్జనులన్ బట్టినదాది చూచు చెలికిన్ సాధ్వీత్వ మెట్లబ్బునో? 99

ఉ. ఉంచికొనంగ నేల? వెల యూడిగపుం జెలులన్ జనుల్ నయో
దంచితమైన వర్తనకుఁ దార్పఁగ నేల? పయిన్ దదన్యథా
భ్యంచనలైన వారలను నల్గఁగ నేల? కటా! భుజంగులన్
వంచనఁ జేసె ధాత్ర యొకపాటివివేకము గల్గఁజేయమిన్. 100

ఉ. ఆచెలి వానిఁ గూడి యిటు లాఱడిపోకలు వోవుచున్ బ్రియా
గోచరమైన ఫక్కి నటు కొన్నిదినమ్ములు వుచ్చె నంత నా
యీ చతురత్వమెల్లఁ దరి నెయ్యెడలన్ వసియించునె యుర్వరే
చూచి క్రమమ్ముగా “నిజము సు” మ్మది యంచుఁ దలంచి యుండొయల్. 101

చ. కలసి యొకానొకప్డు “ఇది గా దది యౌ” నని చర్చఁ జేసి “యీ
తులువ కిదేమి మూఁడెనొకో? తోఁచదు శుద్ధదరిద్రుఁ డిక్కఁగల్
తెలిసినఁ గోపదారి వెనువీయునె? చంపుట కాతఁ డక్కటా!
కలిగెనొకో? దురాత్మునకుఁ గాలము దుర్గతి యిట్టి దుర్మతుల్. 102

ఉ. విప్రులలో జనించియును వీరుఁ డితండు దుపాయములన్ గటా
గ్లపితమానముల్ గృహమునం దెపుడున్ గనుమా పసివాఁ డా
రిప్రిదమంచు నెంచక పొరిన్ బోరి వేఁటకు నేగి కాన జం
తుప్రకరమ్ముఁ జంపుమన దుండగుఁ డిప్పటివున్ సహించునే? 103

చ. అనవుడు వేశ్యకం దను “నవా! యితఁ డేమి యొనర్చునట్టి చ
క్కనివిటుఁ దబ్బి సర్వవిధకామములన్ దన కున్నయప్పు డే
మని యిది గోరఁగావలయు నా యధమున్? వరియించినప్డు నా
దని వెనఁద్రోయువారు గలరా? యిది యూతని దోసమెట్లగున్? 104

తే. గీ. అక్కలికి భాగ్యరేఖ దానట్టిదగుట, వెలికి రాసుండెఁ గాని యీ వెఱ్ఱితనపుఁ
బోఁడ యిటువంటి యతిథులఁ గూడ దింతఁ గొంచె మెఱుఁగదటె నిదిమన కేటికొఱ్ఱ!

చ. ఇది బయలెక్కటే నిజమగ్గే నిజము నాతనిఁ జంపనేల? య
య్యదిత నధింపు టొప్పగును, మూర్ఖుఁడు గానియెడన్ వివేకసం
పదకలిమిన్ జెలిన్ గృహము పాయఁగఁ జేయుటె మేటితెల్వి, కు
క్కదినకమాను నే? తనదు గ్రాసము లేనుఖ మిచ్చి పెంచినన్. 106

చ. అనుకొన రాదుగాని మన మీతని దర్శ్యముఁ దిచ్చనుండి, యే
మని వరియించె నంతకె సహాస్రము చూచినయివ్వేలంది! నే
మని నతి వీడి యీతులవ కబ్బురపుం జనవిచ్చె? వీని ని
వ్వానిత యదెట్లు చేసినను వహ్వారె! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. 107

సీ. తను దత్తుఁగాఁ గయికొనినతల్లి "హలో హాలో" యటంచును దుఃఖమొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చు ననఘులౌ నత్తమామలు లోన మలమల మఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యీ యత్తమురాలు భార్య సంతతధారావృష్టి నేత్రములఁ గురియ
తనయుపక్ష్యపు టాసఁ దలకొంచుగావేళ్లు పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట

తే. గీ. నెందుకీ ముదితోత్తుతో నిటుకు నటుకు, గాలిఁ దిరుగాడు నొకయూఁ గాక సారెఁ
బయనములొనర్చు మను దనవైనవం తుఱుం తెఱుఁగనివీనిఁ బేర్కొనఁగవలయు?

ఉ. మానవులెన్ని? పూవులనుమాళ్ళనుకం దగు తోఁటలెన్ని? పై
నీడువచింపరాఁ దగని వెన్నిసిరుల్? తన కేమివచ్చెన
న్వీడు విడన్? విడెన్ సరియె వెక్కటి సౌఖ్యపురమ్ముఁ జేయుటన్
బూడిద! యేటికిప్పురినిఁ బోవలె వర్తన వద్దె కొంపలన్. 109

శా. ఆప్పాల్ సేయుటతప్ప నే తెఱుఁగఁ డీ యార్యేశయం డెల్లరున్
జప్పా గూడగ మిర్రింగుచుండి రిపు డిద్దాపాత్ముగా లెట్టులే తా
దప్పుం గాక యదృష్టమే యిదియు నీతం డింతలోనైనఁ దా
విప్పా స్నేత్రము, లున్నమట్టునయినన్ వీక్షించి రక్షించెడిన్. 110

చ. అన వటియొక్కఁ డిట్టులను "నాతని కెవ్వ తెఱుంగఁ జెప్ప వా
ర్ల్యవఁ డెవరెన్ని చెప్పినను వీటెఁడి, యంతటఁ బోక చెప్ప వా
నినె వెలిఁజేయు నయ్యతిప నేరుప దెట్టిదొ? యింత పెంకె వా
నినిఁ దన దాసుఁ జేసికొని నిక్కడి నీలెడి నిచ్చువీఁగడిన్. 111

ఉ. ఎవ్వని నేని లెక్కయిడ దెంతటి వానికి నేని మ్రొక్క దీ
ర్ఘోర్వశఁపక్షవలెన్ మనసుగోరిక దీఱఁగ నందు నెంతు నేఁ
డివ్వగఁ జేసెదన్ దగినదే యిది యైన మతేమి లాభమో?
నవ్వరఁగుం బొజుంగిది యథార్థమటంచుఁ దలంపఁ డింతయున్. 112

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నా చెలికోలికిఁ బోవ నేల? యా
యనఘుని దానికిన్ గలసె నాకిఁకఁ, దప్పు లొనర్చుఁగాక యా
తని కవి యొప్పులేయగు వృథా మనకేటికిఁ గంఠశోష! యే
మని "తగువార" మంచు నిది యాతనితో వచియింప నేర్తుమో!. 113

క. ఆదివేశ్య, యితఁడు విటుఁడి, య్యది తప్పెట్టులగు? భార్యలైనవనితలే
వదలంగనేర రీ దు, ర్మదపుం జైనముల, నొరులమాటేమిటికిన్. 114

క. మన మేల నిమిత్తస్యము, గనవలయున్ దీనిఁ బాపగతి దాఁగదు పైఁ
జనుఁ దనయంతన యది యా, య్యనుపునఁ దోఁపదఁగ రాదె? యనఁ దలఁచెన్.

క. "ఏకత్తుమ నిప్పాడిన, నాకత్తురె కాలు" నన్య మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్, నాకొవ్వఁగ రాని, వింత వంతేమిటికిన్.

క. అని మిన్నకుండి రంతటఁ, జనియెన్ మఱి కొన్నినాళ్ళు, చయ్యన నక్కా
మినికి వినాశనకాల, మ్మును మూఁడెన్ తెలిచో సుబుద్ధి వొడమదే!

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీక లెత్త నత్తలోదరి చిత్తమ్మున నుత్తలపాటు దక్కు
యక్కుకవి యుక్కున కొక్కడు మక్కువఁ దక్కుచు సొక్కుచు నున్నంత నొక్క
నాఁటి రేయి యథాపూర్వమ్ముగ నావిటవినోదమ్ములఁ గాలహరణం బొనరించి
నిశీథమ్మగుటయు. 118

చ. తన దయితుండుఁ దాను మఱిఁ దక్కిన నిద్దురఁ గోరి తత్తరయున్.
బెనుగది సందునం దిమిడి వేఱుకు శయ్యలఁ బవ్వళించి యాం
డినయపు డెక్కెకానిపయి డొంపము వాఱును సాహసించి "యీ
జను లెవరేఁ గందు" రని చాన మదిన్ దలపోయ కొప్పుగన్. 119

శా. అంతేల్ చప్పుడు సేయ కుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ
ప్తి దెల్పోవ వెలిగించి పయ్యెడ గుఱిచేఁ బేర్చుమాసన్నుం జూచి "వ
చ్చెం దన్వంగి" యటంచు మేల్కొనిన యా చోరప్రియున్ జేరి యా
నందింపన్ దొడఁగెన్ దదీయ మగఁడెంతం శ్రాంత పాషాణమో 120

ఉ. అలలియెల్లఁ దాఁ గని యుదారుని స్యాలకుఁ డొంతయేని యుక్తిన్
బాలకుఁ డయ్యు లోనఁ "దన బావకు నప్పకు దూర మాటుకున్
మూల మిదే" యటంచు దలపోసి "యి దేఁటికైనఁ బోయినన్
మేలగు నప్ప" కంచు మితి మీఱిన తోషముఁ దోషముక్ దగన్. 121

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయునంత నా
వాల్లకపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి "యింక నే
కల్ల వచించినన్ వఱలఁగు గాదిది నీనికి స్పష్టమాయె నీ
డల్లరి సేయుఁ" డంచు మది నల్లల నాడి దిటమ్ము గాంచియున్. 122

వ. ఉపాయమ్మునఁ బిల్లవానిఁ బిలిచి మంతన మ్మగు నెడమం దీసికొనిపోయి వెలవెలం
బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లను. 123

ఉ. తమ్ముఁడ! నన్ను నప్పగ నెదం దలపోయుము నేను నట్టి చం
దమ్మున నిన్నుఁ బాతు నొక తప్పొనరించితి నెట్లు గడ్పలోఁ
బమ్మిన పేర్మిఁ బెట్టికొని బావ యశమ్ముఁ గరకుచేసెనో
కమ్మవలెన్ స్వబుద్ధికృత కార్యము గా దిది మోస మయ్యెఁ జూ!. 124

ఉ. ఈవిధి దాఁప నేమిగలదే నొక నిద్దుర వోయి లేచి మా
బావ యటంచుఁ దగ్గఱిఁ బాపి యతం డెటు లూహ చేసెనో
భావము మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతకున్
జీవము నీదు హస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మెయిన్. 125

ఉ. పాపపు నిద్రమత్తు పొరఁబా టొనరించెను గాక లేనిచో
"రూపసి" యంచు వానిపయి రోషము జనించి స్వయంవరమ్ము గా
నాపగిదిన్ బయిన్ బడితినా? యిపు డేమన నేమి లాభమౌ?
దీపము కొంప దీసె. దన తేజసు నంతకె పాయునేత్రికిన్. 126

మ. అది గా కెన్ని విధాలఁ జెప్పినను నీ యామాఁక దానెట్టు కీ
గదిలోఁ జేర్పవలెన్? వినందు కద! యీ కర్మమ్ము నేఁ డబ్బె నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుంబాటు లేకున్న ని
గ్గది దక్కంగలదే? యిఁకేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుండుదున్. 127

చ. అరమరలేమి సిగ్గువిడి యంతయుఁ దెల్పెద నంతలోన నే
నరసితిఁ గొన్ని సంగతుల "నాయన కా" రని, యప్పుడేని దు

శ్చరితుఁడు పోవ సమ్మతిన సమ్మతిఁ జెందఁగ వచ్చునా? “యిదే
దొరకెను సం” దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్? 128

చ. ఎవరిని బట్టినన్ విడువ లేదు వచించితి వేనిఁ గోపముం
దవులు నొకప్పు చూచితివె? “ధర్మమె! భార్యను వీడు” టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపున్ మారియాద, వేఱ చె
ప్పవలయునే? యెఱుంగనివి భావగుణమ్ములు నీకు నున్నవే? 129

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నించుకయున్ విన వేమి సేతు? నా
మె నన్ను జామునన్నఁ గడు మేటిగఁ జూడకయున్న దుర్యశో
భ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండఁగ నెల్లరు సంతకన్నను
న్న న్నను వారలన్న “నిను నాలుక గోసెద”నంచుఁ బైఁ బడన్. 130

ఉ. దగ్గఱ కేఁడు నీ పలుఁగు దారిగుడుఁ బోతు లదేమి చెప్పిరో!
యగ్గి! దోసమబ్బినను నబ్బినఁగాక వచింపఁ జెల్లునే?
మ్రిగ్గి గృహమ్ములో నిముడు మానవతీతిలకంబు పట్ల నే
యొగ్గును, నెంతయుం దగదె? హీనులఁ గొంపలు గూల్చు కూళలన్. 131

చ. నిజమగు దోసమున్ గనియు నిందగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు మాడకున్న యటు లక్కడనే మతతుక్ దురాత్ములా!
ప్రిజలకు గీడు సేయుటయు వర్తనమాట నసత్యమేని దా
ని జగతి కెక్కఁ జేయుదురు నీచులఁ జేర్చికొనంగఁ జెల్లునే? 132

ఉ. పుట్టిఁడు పేర్మితోఁ బతి! భోగున నాయమ యెద్వ దారమున్
గట్టిన యామెకన్న ననుఁ గాదనరాదె! యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ రని భావ నెఱుంగుదు నాడె? యింతకున్
గట్టిఁడిదైర మామె నటు నాటియువెట్టెసి నేమి సేయుదున్. 133

ఉ. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్ట నే
హాయిగ నామెచాటున విహారపు భార్యగ నుండి యుర్వగన్
బాయక కొల్వఁగాఁ దలఁతు బానిసతొత్తులు భార్య లౌదురే!
“వేయికి నుండునే” యనుచు వీరపతివ్రత దాన నే మగున్. 134

చ. పతివ్రత యయ్యెఁ జెనెనియును వారగభూమణి, దాని కెట్టులో
ప్రతిన చెసన్ గుటుంబినికి రా వటు దుష్టిని “లేమి” యంటివా!

సతి గల యింటి కిక్కఱఁగణి సంఘముచేరదు చేరనేని యు
న్నతగుణు లుందు రం దవగుణమ్ముల కుప్పలు ము ప్పొనర్పరే? 185

చ. తనుఁ బతియన్న భ్రాంతిమెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
మునికిఁ బయిన్ బడన్ గలఁడె? యోగ్యుఁడు కొండొకనాతి యెట్టిదై
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? వె
వ్వాని నననేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. 186

చ. అని తనదైన తెల్వి యది యంతయు నట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె నీతులను గల్పనసేయుచు నప్పగారిపై
ననుమతి చూపు టాదిగల యాథ మంతయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీగయి సమంజసమై కృప దాని కిట్లనన్. 187

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నేటి కాయన, తోడఁ జెప్పవాఁడ? దుడుకు చెంద
వలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింత ము, పోద మదిగొ చుక్క పొడిచె ననుచు. 188

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁ గొంత, యంతరంగమ్ము విశ్వాసమందఁబోయి
యల్లఁ గనుమూసి నిద్రించునదియు పోలె, నభినయించుచునుండె నయ్యవసరమున. 189

ఉ. వాఁడును "దీన వేమగునొ? వామవిలోచన" కంచు లోన న
వ్వానుచు "దాఁటుకోఁ గలిగి నంతటిదే చెలి" యంచు మెచ్చుచున్
"గూడిక కంతరాయ మొనఁగూడునొకో" యని చింత నొందుచున్
వేడుకదక్క "యెప్పు డిఁక వేఁగునొకో!" యని యెంచుచుండఁగన్. 140

క. కాకమ్ము లఱచె మున్నే, "కోకో" యని కోళ్ళు గూసెఁ గోకమ్ములు సు
శ్రీకలిమి విజ్జివీఁగె ది, వాకరుఁ డుదయించెఁ దెల్వి వఱలె జగమ్ముల్. 141

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బంచమాశ్వాసము.



# పాణిగృహీత.

## షష్ఠాశ్వాసము.



కపటహృదయాంతర్ని
త్యకలితనాదస్వరూప దాతృత్వశ్రీ
ప్రకటితయశస్క బాభా,
నికలాజాలాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ, డించుకేని యెఱుంగమి నెప్పటట్ల
నత్తలోదరితో మాటలాడఁడు గాని, యబల యొక్కింత మది సందియమునఁ బలుకు. 2

మ. తనమర్మం బది గుట్టెఱుంగు ననుచున్ దన్వంగి యబ్బాలునిన్
గన మాటాడఁ, దదగ్రిమందు మసలంగా సందియం బందు నూ
తనుఁడా పేరిమఁడికాని మోము గని తండ్రిన్ జెందు వేయేల? జీ
వనమే బర్వగ నెంచు మించినత్రపాభారమ్ము లొప్పంగదా. 3

వ. అట్టియెడ నుదారుం డచ్చెలిమిన్న చిన్నవోయినవిధమ్మున నున్న దెఱుంగునరుఁ దన కన్నులు బన్నమ్ము గన్నయట్లు చింతించుచు సంతాప మ్మగ్గలమ్ముగ డగ్గఱఁ జేరి బుజ్జగించి యిట్లను. 4

క. తెలవాఱిన మొద లెప్పుడు, కలికిరో? గానమ్ము లేక కవితయు కృషిలోన్
మెలపుమఁ గలకలలాడెడి, తలఁ పేమిట్టి కీదినమునఁ దావక చెడియెన్? 5

మ. కవి యేమయ్యెను? నైత యెం దడఁగె? జోకలేమాటె నేమింతలోఁ
జవి నానాఁటికి హెచ్చెనో? యుడిగెనో? చంద్రాస్య? పద్యమ్ము లె
య్యెవియేనిన్ రచియించితే! చదువు మేదీ? చూత మందెందు నె
ట్టివిశేషమ్ములు గల్గునో? వెసఁగుబోటీ! యింత వంతేటికిన్.

ఉ. వచ్చిననాఁటఁ గోలె నిటు వామవిలోచన? యొక్కనాఁడునున్
ముచ్చట దక్కి యుండ వరమో మయి యీఁగనియంతవంతలోఁ
జొచ్చినదానిఁ బోలె నిటు చూచిన నొక్కవిధాన నుంటి వే
పొచ్చెము లేనిదాని కిటు పోలునె? నీవు సునీలకుంతలా. 7

క. చెప్పుము మది యెట్టిదైనన్, దప్పక తీర్తు ననఁ దరుణి తడవికొనుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం డుండమి, నప్పటికిన్ బొసఁగుహేతు వది కల్పించెన్. 8

క. కల్పించి మిగుల నేరుపు, జల్పనశక్తియును గల్గుసఖి గానఁ దగన్
బొల్పు యది యక్కృతమున దిగులుల్వాపినదుదియుఁ బోలెఁ గోమలి పలుకన్. 9

ఉ. మాటల కేమి లోపమగు? మానసవైఖరి మాటెఁ గానిచో
నేటికి దాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న నా, బిడే
నాఁటను జూడ లే దొకట నాకును మీకు రహస్య మున్న దే?
చాటొనరింపఁగాఁ దగిన సంగతి నా కడఁ గంగ నేటికిన్? 10

క. మిమ్ము నమ్మి కాదె? నామ, ట్టనులకు దవ్వైతి నె తటక్కరులా? కటా!
క్రమముగ నను నేఁటికటుగు, క్రమమునఁ జూచెదరు తప్పుగలిగనె? చెప్పుఁడీ. 11

క. మీయాజ్ఞ మీఱితినో? మీ, కాయాసకరమ్ము లైనయాయాకోర్కుల్
పాయక కోరితినో? న, న్నీయెడఁ సుఁ జూడ నేల? యే లాతినొకో? 12

ఆ. వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు, రేని యింత చింత పూనకుందుఁ
బూవు లమ్మచోటఁ బుడక లేగతి నమ్ము, దాన? మీరెఱుఁగని ధర్మమున్నె? 13

క. ఇఁక మిమ్ముఁ గొల్చుస్నేహితు, లకటా! నను గారవింతురా? వినరే? నా
యఁకఁ డొకటి గొట్టినను మా, ఘుకరపువాఁ డొకటి గొట్ట దొరఁకొనరున్నే? 14

ఉ. పేరిమి దప్పుచో నిచటఁ బెండెలు వట్టుక వేఁల సేల? యిల్
చేరుదునా? యటన్న మది చెల్లదు పంజరమందుఁ గొన్ని నా
ళ్ళీకరము దా వసించి పయి లేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారము నూలుఁ గాని తగుగారవమున్ బచరించి యేలునే? 15

క. కోలమునకున్ వెలి యయితిన్, బలవంతపుబ్రాహ్మణార్థవైఖరి మీకున్
జులుక నగుదాన నైతిన్. దలవ్రాఁతకుఁ జింతసేయఁ దగదే? నాకున్. 16

క. అని బుడిబుడిదుఃఖమ్మున, గనుఁగవ నశ్రువులు దొఱఁగఁగా గద్గదని
స్వన మొలయ మాటలాడఁగ, ననువుపడనివిధము దోఁప నది విరమింపన్. 17

చ. “ఇది యొకహేతు వౌనె చెలి? యింతటివంతకు, దాన నేమి యౌ
న్నది? యడుగంగ నేల? కనినంతన యేమనువాఁడ? జూడు మ
య్యది మటుఁ బెట్టియున్న” దని యాతఁడు తెచ్చి యొసంగునంత న
మ్మదిత పఠింప దించుకయుం మో మటు త్రిప్పదు వ్యాజమూర్తియై. 18

క. దాని కతఁ డెంతయేనియు, లో నొగిలి తదంగనాతిలోలుం డగుటన్
“మానిని? విను వినిచెద నీ, నానేరము సైఁప” మనుచు నారంభించెన్. 19

క. శ్రీరస్తు చిరంజీవి యౌ, దారునకున్ దల్లి శోభనావాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ, మీ జననిప్రేమమున వ్రాయుమే లే మనినన్? 20

మ. కనువా రెవ్వరొ? నీ వెఱుంగవు నినుఁ గన్నట్టులే పెంచి పె
ద్దను గాఁ జేసి కృతార్థుగా సలిపి సంతానార్థమ్ముగాఁ జూడకే
చనె మీతండ్రి, యభాగ్యురాల నగుటన్ జాయాప్రజాదూరు నిన్
గన శీలించితి నేఁటి కీబితుకు? ప్రాక్కర్మమ్ము నిందార్హమే! 21

క. కడచినదానిని పొరెకుఁ, దడవిన లాభమ్ము గలదె? దారకు నీకున్
బడదయ్యెఁ బురాకృత మి, య్యెడ దానిల్లుండె దాని కెవ్వరు కర్తల్. 22

క. "ధనమును వెచ్చించితి" వని, మనమున దిగులొందఁ గలరె? మనుజులు దీనిన్
దినఁగ, మనమూఁడుపొట్టలు, చనకుండునె? చాలఁ జిఱుగఁ జదరయుఁ గాదే! 23

క. చెప్పితిఁ జెప్పించితి నీ, యొప్పమియును దెలిసికొంటి నూఱటగన లే
కిప్పుడిఁక నొకటి వ్రాసెద, నప్పా! యిద్దానికైన ననుమతి గొనుమా?. 24

ఆ. వె వయసు కొద్ది యైనవాఁడవు గాన నీ, కిష్టమైనకన్నె నేటి తెచ్చి
కొనుము పెండ్లి చేసి ధనమెల్ల మీ కిచ్చి, సంతసింతు మేను సతియుఁ గాంచి. 25

గీ. ఇంక నొకమాట భార్యయం దిష్టమింతు, కయుఁ లేదేని యీ పెండ్లి గాని సుఖసు
ఖాల మేమిట్లు లొప్పుట గామనుమ్ము, గేస్తు వగు టెక్కరణిసైనఁ గీర్తికరము. 26

క నీయిష్ట మెట్టులేని సతీయుతుఁడవు గమ్ము నీకుఁ దీపి గలుగు నా
రోయువిధ యఁట్రివా? యది, పాయనిదే మేము చెప్పవారమె యవటన్. 27

క. అని వినిపించిన విని యు, వ్వనజాక్షియు సతినిఁ జూచి "వయసున్ గొమరున్
గొనములు గలసతి యుండఁగఁ, జనునే? నీ కిట్లు మమ్ముఁ జక్కన్ బెట్టన్. 28

తే గీ నీవు బాగుగనే యుందు నింద నాది, యొందు కీలవ్వ? నీకు నే నెప్పుడేని
"భార్య వదలు" మటంచుఁ జెప్పుదుగదా! వి, వేకవంతు లెఱుంగని విధులు కలవె 29

క. అని తనమనమునఁ గలవిసువునవో యిచ్చకమొ కాని పోలఁతి తగుగతిన్
దనకున్ బోధించిన నా, తనిమనమును గొంతకొంత దారన్ మరగన్. 30

తే. గీ ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ, గొంతశాంతించి నట్టుల కుటిలుఁడతఁడు
తలఁచె నాజలజాక్షి యట్టులనె యభినయించె మదినున్న తెఱఁగది యేటకుఁబోవు. 31

క. ఆగతిఁ గొన్ని దినమ్ములు, నేగుటయును నప్పుడేని యింతిమనము దా
బాగుపడదయ్యె దానివి, రాగపుగతి గాంచి దాఁ గరము శంకితుఁడై. 32

ఆ. వె. ఒద్ద నుండువారి నొక్కొక్కరిని నల్లనల్ల నడుగుటయును నందఱటఁగి
యున్నవారలైన నూరకయుండిరె, వ్వానికి వలయు నిట్టిపాడు గొడవ. 33

క. స్వాలకుని నట్ల యనుగుణ్యు బాలకుఁ డగుకతనఁ దగినవనుత్రవ బొంకన్
బాలిక యున్నది యున్నటు, లాలలనకుఁ జేష్టయెల్ల నతనికిఁ జెప్పెన్. 84

క. దానివయి దానిదగుకవి,తానూ నాసక్తియును సహాయము గా "నీ
మానస తోత్రిటు చేయుట,యే నిజ" మని కనలు గదుర నిటు లెద, నెంచెన్. 35

క. ఎవఁడేనిఁ జెప్పినఁ బ్రమ్మ వశము గా దించుకయును మాయ యెఱుఁగఁ డీ
యయ్యవిదనె యక్కఁగఁ గను బ్రీ,నివిమ యమున దోసమెట్లు సేనూహింతున్. 36

క. అని వచ్చెడికోపము,దనమది ముసు పాఁతుకొన్న తాత్పర్యము గ్రీ
ష్కన బ్రిమింగఁ గొన్నినిముసము,లనయము నతిక్రతివిమూఢుఁడై మాఱిన్పడియెన్

ఆ. వె. ఎనిమిదేండ్లనుండి యేకశరీరమై, యున్నవన్నెలాఁడి యొక్కయింత
లోన శత్రువయ్యె,లో మాఱవెనుకట్టి,చిన్నె లెన్నఁబకునె? చేటుదక్క. 38

క. అట్లు మాఱిన్పడి యతం డొక్కింతతడవునకుఁ దెలిసి

తే. గీ. ఎఱుఁగ కుంటిని గాని యూహీనబుద్ధి,యెల్లవుడు నిట్టిదే దీనియెడల నిట్టి
చపలభావమ్ము గలదని సారె నొక్క,చెప్పఁడే? మొట్టమొద లొక్కస్నేహితుఁడు

మ. అకటా! చిన్నటినాఁట నుండియును వశ్యాసక్తతన్ సుంత గా
నక పేర్మిన్ భయభక్తులన్ గొలుచుధన్యన్ మాఱ్చ నిల్లాలి నా
రక యీతొత్తువలన్ దగులొక్కని విచారమ్మాదు మన్నంగఁ జే
యుకుచేష్టన్ దగినట్లొనర్చ నిదియే యుక్తంబు దా నెమ్మియున్. 40

చ. ధనమును వమ్మొనర్చితిని దల్లికిదవ్వయి తాఱికుఁబోతులం
దును నొకపద్దుకైకొని యథోగతికిన్ దగువాఁడ నైతి నీ
యనుచితకృత్య మంతయును నక్కట! యిట్టిది కాదె? హేతు వే
వనుకొన నేమి లాభ మగు? నన్నియు నింతకుఁ దీజఁ బూత్రిగన్. 41

ఆ వె ఏ నెఱుంగనైతిఁ గాని యీదుష్టురా, లింత కొంతమందిని చటుఁ జూచి
"ఇంతకన్న బుద్ధిహీనుఁడు లేఁ"డను, యశము నాకు జగతి కంపెనొక్క. 42

క అని పశ్చాత్తాపమ్మున, గని హితులకుఁ జెప్ప రండగర్భ మగుటఁ గా
దని యటునిటునున్ దోఁపక, తనలోఁ దా నిమిడి యస్మ్యవారుం డుండన్ 43

చ. క్రిమముగ శంకఁ దక్కి యలకంజపలోవన "నాథుస్వాలకుం
డమలినచిత్తుఁడే" యనుచు నాత్మనుదం బొకయింత గాంచుచున్

ఛీ! యని యాతఁ డింక నెడఁ జేసినఁ "జాలును" నంచు జీవమున్
కోయక యెట్టులుందు? సరికోయెనుబోదల్ ననుఁ జూచి నవ్వఁగన్. 51

ఉ. ఎంతటిభాగ్యమే? యనుచు నెంతయదృష్టమొ? యంచు నెంతబల్
వింతలె? యంచు నెంతపొర లేరితలంపులె యంచు ముక్కుపై
వింతులు కేలు వెట్టికొని యెల్లపుడు న్నుతియించు వారు నీ
వంతయె నిక్కమైనను రవంతయుఁ గూడవు జీవనస్థితుల్. 52

గీ. మెఱుగుటాలుపలాతిలోఁ బొడముపలుగు, లేదఁ సంసారిజనులతో ప్రవతెవ? యిక్క
కిందు నే? నేయి"యని మోముమెచుట నెల్ల, వారు నిందింప బ్రతికినభాగ్యమేమి. 53

చ. పొడమితి నేకొలమ్మునను పొందితి మిక్కుటమైనభోగముల్
గడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లరయై చనన్
వొడిగితిఁ గట్టితిన్ గులముతో యాలుతెల్లు నిబా సనంగ ని
త్యోడ నిఁక నేమియైన నగు నెంతయు శాశ్వత మీశరీరముల్. 54

ఉ. వినను నాత్మహత్య యది యంత శుభప్రద మంచు నెంచమిన్
నానెఱజాణచెయ్దముల నాయకిఁ గా దని నమ్మఁ జేసి నా
పై నెవ రిట్లు చెప్పిరో? కృపారహితుల్ కపటాత్ము, లిప్పు డ
క్కాని దురాత్ములన్ విడలఁగా నొనరించెదఁ గాక యం చొగిన్. 55

ఉ. చిత్తము గట్టి చేసికొని చిన్న లెజెంగిజాణ గాన లో
ను త్తలపాటు లేనిచెలియుం బలె దగ్గఱఁ జేరి వెక్కయై
య త్తలిగారుఁబోడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
ద త్తరమంది "యెవ్వ" రని తక్కుగళంజసమాగమమ్మునన్. 56

క. మెత్త వడెడివి త్తమ్మను నొత్తిగిలన్ జేసి, చేతు లొక్కింతన దా
నెత్తి వెలిఁ జిమ్మి "సీ!సీ!, తొత్తా? వను మట్టఁ బోకు తొలఁగు" మటన్నన్. 57

ఆ. వె. డిల్లవోయి తనదు డెందమ్ము పటిమలై, కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
శకునములును గావసత్యముల్ నిజ"మని, మనసు మరల ధైర్యమునకుఁ జొనిపి. 58

క. "పరకీయచందమునకున్, జొరబడితింగాని నుంతసౌమ్యగకై క
క్కురితిం బడనుగదా? యో, తరుణులకున్ లేని విట్టి దశ" లని వగచున్. 59

వ. అని త్రాడువాటి యవ్వారిజాక్షి చురచురఁ జూచుచు. 60

ఉ. ఎప్పుడు లేనిరీతి యిది యెట్టిది? యింతటిరిట్టు తిట్టు, నే
త ప్పాచరించితిన్ ?, వెనుక దారి యదెల్లను దప్పె నింతలో
నెప్పలుగుల్ మతేమి వచియించితి? నవ్వుల కిట్టు లాడుటో?
చప్పుడు గాక యుండెద నను సాగఁగఁ దోలు నుపాయమో? కదా. 21

తే. గీ. భార్యఁ బాలింపుమని నిన్ను వచ్చియుండ, యుగ్రరమ్మునఁ జిగురున నున్న యట్టి
తల్లిమాటను బాటింపఁ దలఁచుటొక్కొ? యే నెచటికేగుదాన? నిన్నిపుడు విడిచి.

తే. గీ. వరుసు దార దోసి వచ్చినయప్పటి, నుండి నిన్నుఁ గొల్చి యొకటనైన
భేద మిత లేని పేర్మిమెలంగిన, దాన నెటుల నిపుడు తలఁగుదాన? 63

తే గీ. వంటబ్రాహ్మణుతోఁ గాని బట్టలుతుకు, వానితోఁగాని బట్రొతువానితోడఁ
గాని లోకమ్ములోపాటు గా నొకింత, కులికితినొ యెంచుకింత మీకులికిపాటు? 64

ఉ. ఇంతకుఁ దప్పు లేనను నిక్కరణిన్ జనునే? తిరస్కృతి
స్వాంత నొనర్ప, నొక్కయెడ నమ్ముటయున్ గలుగున్ దొసంగు; ర
క్తాంత విచారణల్ వలయునా? "యది దున్నయు దూడ పుట్టె" న
న్నంతన "పట్టు దె" మ్మనఁగ నౌనె? భవాదృశుఁ డైనమేటికిన్. 65

చ. అని నిలుపోప రామి నయనాంచలసంచలదశ్రుమాలికల్
పెనఁగొని గద్గదస్వనము పేరి వచస్స్థితి దప్పఁ జేయ నా
తనిపదముల్ శిరమ్మునకుఁ దాకఁగ నొయ్యన వ్రాలి యేడ్చె న
క్కనకనిభాంగి యాతనికిఁ గంటఁ దడిన్ జనియింపఁ జేయుచున్. 66

క. విరిసెడికోపము పొరిఁబొరిఁ, బురికొనఁగాఁ జేసికొని నభ్రంసవగతి ద
త్తరపాటు దక్కియుంచుక, తరలి మరలఁ బల్కె నయ్యుదారుఁడు దయతోన్. 67

క. ఎక్కడి నీ వెక్కడి నే, నెక్కడినమ్మకలు? వలపు లెక్కడ? కొన్నా
ళ్లక్కఱ పడి తిరిగితి మ్రాన్పడ్డవ లన్నియును నాఁటిమాటలు చెలియా! 58

క అప్పటినీవును వేఱె, యప్పటియానేను వేఱె యప్పటికాలం
బిప్పుడు రమ్మన వచ్చునె? యిప్పటికిన్ దగినరీతు లిప్పుడు వచ్చున్. 69

ఉ. రొక్కము లేక కాదు నిను రోసినయంతఁ గాదు మఱొక్కలేమకున్
దక్కియుఁ గాదు చెప్పెద యథార్థపుసంగతి చిత్తశాంతిలోఁ
గుక్కలరీతి నొక్కవెఱకోమలికై పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు ఛీ! యసహించి విరక్తి చెందితిన్. 71

క. అని యటు నిలువక జాలక, చని వేఱొక్కెడకుఁ గొంత శాంతించియు న
వ్వనితన్ సుకవిన్ సహితమ్ముగనె యిలువెడలింప నెంచి కఱకువాదముగన్ 72

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱఁగాఁ బిల్చి, కార్య మిట్టిదని యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి, యిట్టులనియెఁ జిన్నయెలుఁగు దోఁప.

చ. వెలఁదిరో! యుగుర్తిఁడై యకటఁకు వెల్గుమ నుండెఁ దటాల్న నియ్యెడం
దొలఁగుము లేనిచోఁ గలుగుఁ దొందర లెట్టివియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు నీ వపుడు పేమిమ్మై నట రాను వచ్చు, నిన్
దలఁచిన నీరు గాఁడె? యిటు తా వృథగా వెడలింప నేటికిన్. 73

క. అని యెన్ని చెప్పినను న, వ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాతఁ డేమి సేయు? నె? వనివశ మగు? దాని నచ్చోటు వాయన్ జేయన్. 74

క. పదపడి లోఁబడ యగుటన్, గదలించెన్ సుకవి నిల్లు గదలి చనెడి యా
త్మదయితు చందమ్మునకున్, మదిఁ దనదశకన్న వెలఁది మలమల మఱుఁగున్. 75

క. అటు లొక్క రెండుదినములు, కటకట! యని యెల్లనరుఁగఁ గలి? యనశన
స్ఫుటకఠినోపోషణముల, నటఁ గదలక యతనికరుణకై కాచునెడన్. 76

తే. గీ. కరుణ యొదవియు నాతఁడక్కలికి యెఱుఁగ, ముంచి విధమున డాఁచి "యి
ట్లొటినింటు, విడుచుపిమ్మటకలసిన డిదికిటుకు, రమ్మనినబుద్ధిగానుండురమణి" యనుచు

క. లోనెంచి దాని నానా,నూనవిభూషణకదంబ మొకట్టిరుఁ గొన క
మ్మానినియిలు చేర్పించియు, దానిజనని కిల్లువార్త దా నంపించెన్. 78

క. నీకొమిరె దుర్మదంపు, బోకిళ్లను నాకు రోఁత పుట్టెఁ "జను" మన్
వే కదలదు రెణ్ణాళ్లై, శోకించుచు లంఘనముల నుగ్గిరుక్కుచు నుండెన్. 79

తే. గీ. దానియాస్తి యావత్తు నీదగ్గఱ కిపు, డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల, వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. 80

క. అనుమాట వినినయంతన, చని తా నవ్వేశ్యమాత జామాతను చే
ర్చినరీతి వేఁడికొని యాత్మనిచవుం గాన కంతఁ దనయున్ గనియున్. 81

క. మెలమెల్లన బోధించియుఁ, జలమున రానొల్ల ననెడిచానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె నదియు,వ్వేఁ దనయిలు సేరి లోన వగచుచునుండెన్. 82

క. ఇదియంతయు విని "దైవము, బ్రిదికించె న్నన్ను నాదుపట్టయి" యని య
మ్మదిత యిలుసొచ్చెఁ గవ్యప్ప్రశదు "డదియేమనునో" య నెడిశంక వెఱబడన్. 78

చ. కళవళమందుచున్ వెతలఁ గందుచుఁ గుందుచు నున్నబోఁటి య
వ్వేల వలపుల్ మగండటకు వచ్చినయంతన తేటిమాచి వె
ల్వేల దిగఁద్రావి యాతనిచవిన్ బడి కుల్కఁగ సాగ నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లీఁద నశక్య మెట్లగున్. 83

ఉ. "ఏమిటికై వరించితివొ యివ్విడఁగుంగవిఁ దీరెఁగాదె! యా
యామద మెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప కేమటం
చీమెయి దూర్చెదే?" యనుచు వృద్ధ వెసన్ దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయకయ కూటములన్ గరఁగించునక్కవిన్. 84

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన నా
నాగతి "నాప్రియుం డిటకు నాకయి నాఁ డనయుంత వచ్చి బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులోఁ ననుఁ బాయఁ గలండు దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు సారెకున్. 85

చ. అవటు నుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్టులెంచవో
"సచివులు భృత్యులున్ మిగులఁ జౌకఁగ నెంతు" రటంచుఁ గొందఱు "న
వ్విచికిలగంధిసాటి పదివేలను లే" రని లోఁనఁ జింతిలున్. 86

క. డోలాయమాన మగుమది, తో లీలలు దక్కి యతఁడు తొయ్యలిఫోటో
లాలోకించుచుఁ గుందుచుఁ, గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్. 87

క. ఆరీతియెల్లఁ గని "య, వ్వారాంగన యిటకు మరల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు, వారించెడివలను జూచువా రయి కడఁకన్. 88

తే. గీ. దానియుప్పటివర్తనఁ దథ్యముగ నెఱింగి "యిప్పటికేని యావంగులాఁడి
వాని వదలదు నీకు నీవంత యేల?, కావలసెనేనిఁ బట్టియీఁగలదు సొమ్ము" 89

క. అనుడు "నటులాచరించునె?, వనితరుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని, తనమదిలో నున్న తెఱఁగతండు వచింపన్. 90

క. వారును నొకసమయము గని, యారామామణికిఁ గవికి నరుచేరిక క
న్నారంగన్ జూపంగ ను, దారునిరాగాంకురము మొదట్రికి నశించెన్. 91

క. తనతప్పిదమును బ్రియుఁడే, కనలారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నప్రదు బొంకి నమ్మమి, ననరాని దొరయు లెల్ల ననిపించికొనెన్. 92

చ. వదపడి యింక నాతనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాస మొదలే నశియింపఁగ ధైర్యమంతయున్
వదలి "యిఁకేటి బెట్టుసరి! వైఖరి బొత్తిగఁ దప్పె" నంచు న
మ్ముదిత "యుపాయ మిట్టి" దని మాటికి నెంచి కృతప్రయత్నయై 94

మ. తనకున్ దాసయి యొక్క రేయి యతనిన్ దర్శించి దీనాస్యయై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్ములన్ శిరం బుంచి, "పే
ర్మి ననున్ వే గరుణింపఁ దప్పదనుచున్ మే లెంచు మంచున్, వచిం
పనిదయ్యున్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపనున్నంతటన్. 95

ఉ. ముందుచు నింటి కేగి దనకుం గలతెల్వి యదెల్ల దైన్యపుం
జందమునంద చేర్చి యొకజాబిటు వ్రాయఁగఁ బూనె నద్దిరా!
చందనగంధులెట్టిఘనసాహస మైన నొనర్చి బొంకి నా
గుం దమ చెయ్వులన్ వెనుకఁ ద్రొక్కఁగఁ జేయుదు రెట్టి కృద్ధునిన్ 96

క. య మ్మా రావ్వె గారికి, నమ్మినమీదాసి చరణనతముఖినై దం
డమ్ములు సారెకు మ్రొక్కుచు, నిమ్మయి వ్రాసికొనుమనవు, లియ్యవి యయ్యెన్

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నీక్షణమున్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచున్
దినములు పుచ్చు దాన నిదె దేవుని చెయ్దిని నాఁటినాళ్లనుం
డి సెనరు మాలి మీరు కరుణింపమి నీగతి నుంటి నొంటిగన్

క. ఇఁక నుండఁజాల నాచే, యీకుటిలచేష్ట లవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెఱింగి రోజిం, చి కరుణ నిల్పఁ దగు నాదు జీవము తఱితోన్

క. పే రేల చెప్పవలె నన్, బ్రేరేపించి రిటు మీకుఁ బ్రియము గలుగు వా
రారయ కాదుర్బోధవు, ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్

క. నాకర్మమ్మునఁ గలపని, యే కారణమైన నేమి! యిటు లోకపతిఁ దాఁ
జేకూరె నిక్క మిది పై, శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. 100

చ. తదుపరి కొంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
వెదకుటు, కంటి దయ్యె ననుపేఁడి గా గణియించి యిట్టిబె
ట్టిద మగుకంతకున్ దొనుపులే యొకయాటగ నెంచి వారు న
న్నది పొనరింపఁ జేసి, రెవరైనను గర్మము దాఁటువారమే?. 101

క. ఈగతి నాతల వ్రాసెవు, ధీగతి విధి, తలఁపు మిక్కుటఁ దగులమి నోరుపై
రాగిల్లి మనఃపూర్వక, భోగము గావింప లేను పొరఁబడి చెడితిన్. 102

ఉ. ఏకొలమందుఁ బుట్టితిను నిన్నిదినమ్ములనుండి మీగృహం
బేకనివాస మాట నిఁక నిప్పుడు పుంగొలపుంగృహమ్మున
న్నాకుఁ బదమ్ము లాగవు ధనమ్మును వద్దు ధనమ్ము వద్దు నా
రాఁకకు మాత్రి మొప్పుము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా.

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బ్రాఁతచీరతే
నిడుఁ డిది చాలు నాయసువు లెంతకు నీచెడుమేన నుండు న
ట్కిడదనుకన్ భవచ్చరణకంజములన్ గనిపెట్టుకొందు నిల్
దుడిచెదఁ బ్రక్కలన్ బఱతుఁ దొట్టికర్మము నెంచుమన్ ప్రియా.

ఉ. ఇచ్చక మంచు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నును గూడ వద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుకాణియుఁ గోరకుండ లో
నచ్చదు నాకుఁ దల్లికిని నాథ? యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చటిదొక్కటే, చిగురుముద్దిటు చెల్లఁగఁ జేయు మిమ్మయిన్. 106

ఉ. మీ రెటు సేయుమన్న నటు మీఱక చేసెదఁ గన్నులార మి
మ్మారయ టొక్కటే వలచు నన్యము గోరను మీదు దాసికీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పఁ డదే పదివేలు దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుకవార్త, క్షమింపుఁ డన్నియున్. 107

క. ఇచ్చయొ యనిచ్ఛయో మీ,రిచ్చపలస్వాంత కిపుడ యొప్పులు పవలెన్
బొచ్చెమ్ము వలవ దది మీ,యుచ్చరములతోడ వ్రాయ టుభ్యర్థింతున్. 108

క. అనివ్రాసియంపుటయు దా,నిని గని యాతండు మనము నీరగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో, నను కొను నిక్కారణిఁ బ్రేచు మగ్గల మగుడున్

మ. అకటా! యంతటిదాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లునే?
వికలత్వం బకటా! నృపాంగనగతిన్, వేమంది సేవించు దా
నికి దాస్యంబుచితంబె! యెంతవగపున్ జిత్తమ్మునన్ లేనిచో
సకి యీనీచత కొప్పునే!, చెలిరో! పశ్చాత్తాప మిట్లున్నదే? 110

క. కానిమ్ము నిన్ను మరలన్, బూనికమైఁ గొన్న మొగము పొంతనె లోకుల్
"ఛీ! నిందుఁ" డనుచు నుమియుదురె!, నానేరం భేమి? యిపట నాకీక్షణికో. 111

ఉ॥ నీటును గోటునుఙ్ దగిననేర్పును నోరుపు వన్నెచిన్నెలుఙ్
దేటయుఁ దెల్వియుఙ్ గలుగు నెయ్యపుఁబోఁడ్యాలు లెందఁ గాని నీ
పాటివెలందు లౌదురె? సెబాసు! బళా! వహవా! వహవ్వ! నీ
మాటలసౌరుతీరు గలమానిని నేను జగానఁ గానఁగా.

చ॥ గలగల లాడుగాగరలు కంగులు రంగు లెసంగురైకలుఙ్
పారువును మువ్వనుం దగుపయంటలు పోడరు లత్తరుల్ విరుల్
గర మలరారుభూషలును గాక వెలందు లటంచుఁ గల్గిరే?
సరసిరుహాక్షి? మీకొలముచానలలో నినుఁ దక్క నొక్కడఙ్. 112

చ॥ అగుదువు సోయగమ్ముగలయట్టివిలాసిని వైన నేమి? నీ
సొగసును జూపునోపులును సుందరి! వ్యర్థము లంచుఁ జెప్పఁగా
దగు నది యేమనఙ్ వినుము తన్విరో? యోగ్యత లేనియప్పు డ
మ్మగువను బొందువాఁ డనగ మాలఁడొ? మాదిగవాఁడొ? గాఁదగుఙ్. 114

తే. గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము? యోగ్యత యొకింతగలుగని యువతిమణికి
నెన్నఁగ లెట్టిహృదయేశు. డెట్టితళుకు లుండినను బొట్టు లేమన్న ముండయనరె?

తే. గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన నింద యొనరించుట దిసుంచిచంద మతివ !
గాన నావంటివిశ్వాసహీనుఁ డెందుఁ, గానరాఁడు జగమ్మునఁ గలికిమిన్న.

ఉ. ఎందటినైనఁ జూచితి నికెందటినైనను జూడనుంటి నో
సుందరి! నీదుచంధమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు! నవారవిందవదనా? పద నామొద నాటఁ బోదు నీ
కుం దగునందకానిఁ గయికొందువు నా కయి కుందనేటికిఙ్.

క. అని యచ్చెలి తనయెమటుఙ్, గనుపట్టఁ బ్రాతి దోఁపఁగాఁ బల్కెడియా
తనిచందము గని దూతిక, యును, "నయ్యా! నన్నుఁ బంపరా! యిఁకనైనఙ్". 117

క. దానఁ దెలివొంది "తనయు, జ్ఞానభరం బది యొతింగెఁ గా!" యని లజ్జన్
లో నొందుచుఁ "జను ముత్తర, మే నీ తే" దని వచింపు మేటికిఁ దడయఙ్,

చ. అన నదియేగ, నంతవల నాజలజాక్షి యెదుఁ "బోయి దూతి రా
దనుకొను లేఖ తెచ్చునొకొ? యంచుఁ దపించు "నొసంగదుండునే?"
యని ధృతి గాంచు "నట్టిదడిదాసల" యంచు నిరాశ నించు జే
సిని ధిని ప్రాణముల్ విడుతు నే" నసుకొంచుఁ గశించు పదములఙ్. 119

ఉ. నేర్చియొ నేరకో యిటుల నే నొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చినయాగ్రహమ్ము మెయిఁ బ్రేమ యొకింతయు లేక యింత న
న్నేర్చునె! భార్యనే? పడపుట్టింతిని గానె? యిదెంత దోస మీ
చర్చ యదేల? యాతనికిఁ జచ్చి యశ మ్మొనఁగూర్చు టొప్పదే. 121

క. అని కృతనిశ్చయయై విమ,లుని సిద్ధము చేసికొని యమోఘవ్యవసా
యనిబద్ధచిత్తయై యుం,డు నెడన్ దటి కేగి యయ్యనుంగున్ జెలియున్. 122

క. "పరిత్యక్తర మీ లే" దన, సత్యంతామర్షఘూర్ణి తాంతరయై "ప్రా
ణత్యాగమె వర మిఁక సం, స్తుత్యనుగుణంపుబ్రతుకు చొప్పడ నేలా?

క. మును వేశ్య లొక్కకొందఱు, తనువున్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని రేను విటునియనుమతి, కని ప్రాణం బూడ్చి సుచిరయశముం గొందున్

క. అని మరల మనము వెనుఁదీ, సినఁ దత్తరపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నా, తని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్.

ఉ. ఇంతకు మున్ను మీకు లిఖియించిన కమ్మపరిత్యాగ మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకు నై బ్రదుకన్ దలంతు నో
కాంత! బహూక్తు లేల? యది కష్టము? యిష్టము? నేఁటిరాత్రికే
పంతము మాని తెల్పు టది బాగని యెంచి నమస్కరించితిన్. 125

క. అని వ్రాసి మరల పంపినఁ, గనుఁగొని లోలోన నతఁడు కరుణవొడమియున్
వెనువెంటఁ గోప ముబ్బఁగఁ, దనలో దా నిట్లొకింత తల్లడ మందున్. 126

ఉ. చచ్చుట నిక్కమే యగు విశాలవిలోచన, చావక యుండుఁ గా
కిచ్చట కెట్లు రాఁ దగు? నిహీ! యని యెల్లరు నవ్వరే? సరే
యచ్చటులాక్షి యీపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పో! కడు మేలగు నెన్నిభంగులన్. 127

వ॥ అని యద్దానిం దలంచుకొని.

ఆ. వె. ఇపుడు చావ నేల? యింతకు మున్న స,చ్చితిని నీవ కావు చెలియమిన్న
వీఁడు నట్టివాఁడె, ఖేదమ్ము గల్గునే?, మనకు నెన్నఁడేని వనజనయన. 128

ఉ. పుట్టరే? గిట్టరె? జనులు పుట్టిన నే మగుఁ? గిట్ట నేమగున్?
గట్టుగ వర్తనమ్ము చెడి కాపథవర్తను లైనవారి కె

ప్పట్టున సౌఖ్య మందదె యథవా యొకపట్టునఁ గల్గుఁగాక దా
నిట్టిద యౌ ననీ! చెడితి నెమ్మియు నన్ గెడఁగొట్టి తంగనా.

మ. గృహిణీవర్తనమందు నీవుఁ గలవర్తిన్ గాంచి నీహేతువై
"బహుదుశ్శీలలు మాకొలన్ను గుణముం బాటించు" నం చెంచితిన్
మహిళారత్నమ! యన్నియున్ మృషలె నీమాటల్ సెబా! నింతకున్
బహి పెట్టన్ బడి పాప మూద్చు మనుచున్ వ్రాసెన్ విధాత్రుం డహో.

ఉ. ఏనను జీవ మూద్చుకొని యే పరితింతునో! దాన నేమగున్!
మానిని! యాఁడుదాని కది మన్ననఁ దెచ్చెనునట్లు పూరుషుం
డని నొసంగఁ దెక్కరణి నిన్ విడియుండుదు నేమొగమ్ముతో
నే నినుఁ బూర్వమున్ బలె గణింతు? ఘటింపవు రెండునున్ జెలీ. 182

క. అని యత్తుదిశాబునమను, దనపరిత్యక్తరము నిడక తరుణీమణి దూ,
తిని నంపుడు దా నచ్చెలి,విని యాపై నొడలు వీడ విసమున్ మెసవెన్. 183

క. అక్కటతన నర్తలోదరి, మిక్కుటమగు నార్తిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది,నెక్కుడు చింతించె నాతఁ డిదియొప్పదొకో. 184

చ. అయ్యదియెట్టిదైన, హృదయంబు సదా తదధీనమాగతిన్
నెయ్యమునైమె లంగునలనీటు పెడంగు బొజుంగు నేఁటి క
త్తొయ్యలి యాత్మహేతువున దుక్కమొయున్ మృతిఁజెంద నెంతగా
దయ్యము నేఁటికై వగచి తాళఁగలే కెదఁగుందఁగావలెన్. 185

క. పగవారల మృతికైనను,దగువారలహృదయమునకుఁ దాపము దవులున్
మిగులఁ బ్రియమైన యాసో,దగపుంగని కతఁడు శోకమందుట తగదే! 186

చ. అరసితిరే! యుదారుగతి, యక్కట! యెంతకు వచ్చె! దైవమా!
మరిగ యళంబు గంగఁబడెఁ జొక్కపు మేని పసం దడంగ దు
ర్భరమగు పాతకం బొకటి పైఁబడె దుఃఖముతోడిపా టహో
దురితపుసంత వారసతితోఁ దగునే? తగులాట మేరికిన్. 187

వ. వదవడి యయ్యుదారుండును.

ఉ. దానిపరిసక్తి యెల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను శోకపాత్రి గృహస్థుపాలెక్క నుండె ర

జ్ఞాన మదెల్లఁ బోయె భవసాగర మెందు నసార మంచు లో
లో నెటిఁగెన్ మఱెయ్యెడల లోటుఁడు గామియు దానఁ జేసెడున్. 138

క. ఆపయి వేశ్య లనినఁ ద్రవ్యాపృతి గలవార లనిన నత్యధికాసూ
యాపవరకుఁడై చూచు స్వలోపములన్నియును దలఁచి లో లజ్జించున్. 139

చ. తనభయ మింత లేమిని యదాయద లౌనలయగ్రహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటయున్ మది రోసి వానిసె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల సుదీర్ఘయశం బనిశంబు గ్రమ్మఁగన్. 140

గద్య.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీ శతావధానితిరుపతివేంకటేశ్వరులచే
రచియింపఁబడిన పాణిగృహీతయందు

సర్వమును

షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.

